# కవిపూజ

సంపాదకులు: చింతా దీక్షితులు

... పబ్లిషర్సు



# కవిపూజ

తల్లావజ్ఝల కృత్తివాసతీర్థులు

బి. ఏ., బి. ఇడి.

సంపాదకులు:

శ్రీ చింతా దీక్షితులు, బి. ఏ., ఎల్. టి.





త్రివేణీ పబ్లిషర్సు

మచిలీపట్టణము

అ. 12

*First Edition—Dec. 1947*
*Second ,, —May 1948*
*Third ,, —July 1949*




*Approved by the Madras Text-Book Committee for class use f r Standards 6, 7 and 8 (Vide Fort St George Gazette, Part I (Ele. Schools) Dated 1-6-48 P. 10) and for Forms I, II and III Vide Part II (Secondary Schools) P. 24.*



Printed at the Weldun Press, Madras 21.

# పీఠిక

ఈ గ్రంథమున ప్రసిద్ధులగు తెలుగుకవుల జీవితములనుండి రసవత్తర ఘట్టములు గ్రహించి ప్రదర్శింపబడినవి.

ఆంధ్రసాహిత్యముపై విద్యార్థుల కభిరుచి కలిగించుటకు ప్రధాన సాధనము, ఆంధ్రకవుల జీవితములగూర్చియు, వారు రచించిన కృతులనుగూర్చియు వారికి తెలుపుట; ఆ యా కవుల పద్యములను రుచి చూపుట.

ముఖ్యముగా తెలుగు కవులకు సంబంధించిన కథలు కొన్ని తెలుగుదేశమున వ్యాపించియున్నవి. అవి పండితులకే గాక తదితరులకును ఆనందమును, చేకూర్చుచున్నవి. అట్టి కథల నాధారముగా జేసికొని ఆ యా కవులకును, తత్కవి కృతులకును సంబంధించిన విశేషములు విద్యార్థులకు బోధించిన వా రానందముతో గ్రహింపగలరు.

విద్యార్థులకు సారస్వతముపై అనురక్తి కలిగించుటయే ప్రధానోద్దేశముగా పెట్టుకొన్న ఈ గ్రంథములోని కొన్నికథలు, ప్రచారములోనున్న వే యైనను, నేటి పరిశోధనలనుబట్టి చూచిన సత్యేతరముగా తోచవచ్చును. కాని ఆ కారణమున నా కథలను మనము పరిహరింపజాలము. విద్యార్థులకు సాహిత్యముపై అభిరుచి పుట్టుటకొరకు అట్టి కథలను వాడవలసి యుండును. అందువల్ల కావ్యపఠనాసక్తి యను ఉత్కృష్ట ఫలము విద్యార్థులకు చేకూరగలదు.

ఈ గ్రంథమున చేర్చిన కవులందరు సుప్రసిద్ధులు. మనోహర కావ్యకుసుమములతో తెలుగుతల్లిని పూజించినవారు. తెలుగుదేశమున వారి కావ్యములు చిరప్రసిద్ధి గన్నవి.

ఈ గ్రంథమును పఠించిన విద్యార్థులకు తెలుగు సాహిత్యముపై దృఢాభిమానము కలుగునుగాక.

—చింతా దీక్షితులు.

# కవి పూజ



## బమ్మెర పోతనామాత్యుడు

౧

'తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతం బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదువాక్కులను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షీ సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా !'

యను పద్యమును బాలురు ప్రతినిత్యము పఠింతురు. బమ్మెర పోతనయే నీ పద్యము రచించెనని పలువు రెరుంగుదురు. వేదవ్యాసుడు సంస్కృతములో రచించిన భాగవతమును బమ్మెర పోతనామాత్యుడు తెనిగించెను. ఈ మహాకవి 1432 సంవత్సరమున నోరుగల్లునకు సమీపమున బమ్మెర గ్రామమున కేసన లక్కమాంబలకు జన్మించెను. ఇతని తలిదండ్రులు పరమభక్తులు. ఆ కారణమున పోతనకుకూడ బాల్యముననే పరమేశ్వరుని యందలి భక్తి యలవడెను. ఇతడు గురు శుశ్రూష చేసి శాస్త్రాభ్యాసము సలిపెను.

ఒకనా డీశ్వరాలయమున రుద్రాభిషేకము జరుగుచుండెను. పోతన తన్మయుడై అప్రయత్నముగ పద్యమల్లెను. కొలది కాలమునకే పోతన 'వీరభద్రవిజయ' మనుకావ్యము

రచించెను. మిత్రులు కొందరు పోతనకవిత బాగున్నదని మెచ్చుకొనిరి. రాజాశ్రయము లేని కవిత శోభింపదని వారు పలుమారు కవీంద్రునకు సలహానిచ్చిరి. పోతనకు రాజాశ్రయమన్న నిష్టము లేదు. అతడు మనుజేశ్వరులను బొగడి కావ్యములను వారి కీయ దలపలేదు.

ఆ పుణ్యమూర్తికి స్వప్నములో శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించెను. శ్రీరాముడు కవీంద్రుని భాగవతమును తెనిగింపుమని చెప్పినట్లు స్వప్నమురాగా నితడు శ్రీరామాంకితముగ భాగవత పురాణమును రచించెను. పోతన నిదుర లేచి తాటియాకును దీసి గంటముతో నీ పద్యము వ్రాసెను,

‘పలికెడిది భాగవతమట
పలికించెడువాడు రామభద్రుం డట నే
పలికిన భవహార మగునట
పలికెద వేరొండు గాథ పలుకగ నేలా ?’

పోతన గ్రహణసమయమున గోదావరీ స్నానము గావించి మహేశ్వరధ్యానము సలిపెను. ధ్యానానంతరము భాగవత రచనము జేయ దొడగెను.

‘అమ్మల గన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల బె ద్దమ్మ సురారులమ్మ కడుపారడిపుచ్చిన యమ్మ దన్ను లో నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ, దుర్గ మా యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్’

ఈరీతిగా పోతన పరవశుడై భక్తిభావమున భాగవతము రచించెను. ఆయన కావ్య మల్లుచున్నాడేకాని తినుటకు సమృద్ధిగ తిండిలేదు. పోతన కుమారుడు మల్లన తండ్రిని జేరి "నాయనా! ఇల్లు గడచుట కష్టముగ నున్నది. పోనీ భాగవత మెవరికైన గృతి యొసంగిన ధనము వచ్చును. ఏమందు"రని బలికెను. పోతన కన్నులు తుడుచుకొని "ధీరులు దారిద్ర్యమును లెక్కసేయరు. పవిత్రమైన భాగవత మొరుల కమ్మను. దైవద్రోహము చేయను. తిండి గడచుటకు సేద్యము చేయుదము. రెం డరకలు దున్ని కాలక్షేపము చేయవచ్చును. రాజాశ్రయమన్న నాకు సరిపడదు.

'ఇమ్మనుజేశ్వ రాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకడు భాగవతంబు జగద్ధితంబుగన్'

అని పోతన తన పద్యము పఠించెను. మల్లన తండ్రిగారి భక్తి కాశ్చర్యపడెను. "నాన్నగారూ! మీరింత ధీరులని, భక్తులని నేను దలపలేదు. నామాటలను మన్నింపుడు. మీరు చెప్పినట్లు మడిదున్నుకొని జీవింతము" అని యాతడు పలికెను.

"కుమారా! కేవలము కలకాలము జీవించిన నిష్ప్రయోజనము.

'చేతులారంగ శివుని బూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని

దయయు సత్యంబు లోనుగా దలపడేని
గలుగ నేటికి దల్లుల కడుపు జేటు'.

"తండ్రీ, మీరు చెప్పినటుల జేతును."

ప్రతిదినము కనుచీకటి యుండగనే పోతన, అతని కుమారుడును నిదుర లేచి ప్రాతఃకాలకృత్యములు నిర్వర్తించుకొందురు. వా రెద్దులను దోలుకొని పొలమునకు వెడలుదురు. ఒకనాడు పోతన కుమారునిచే దుక్కి దున్నించుచుండెను. ఎద్దుల మెడలలో మువ్వలు రింగు రింగున మ్రోయసాగెను. పొలము ప్రక్కగా నున్న పుంతలో పల్లకీ మ్రోయుచు నూతపద మెవరో పాడుచుండిరి. పదము విని మల్లన పరకాయించి చెవులు రిక్కించెను. పాలకిలో శ్రీనాథుడుండెను. శ్రీనాథుడు తన పేదరికము బాపుకొనుటకు సర్వజ్ఞప్రభు దర్శనమునకు పాలకి నెక్కి వెడలుచుండెను. ఆయన తన ఘనత జూపుటకై పాలకీ మ్రోయువారలను నొకకొమ్ము విడువు డని యాన తిచ్చెను. ఒక వైపున మ్రోయువారు లేకయే యందలము నడచుట మల్లన జూచెను. "నాన్నగారూ! చోద్యముగ నున్నది" అని మల్లన తండ్రికి పల్లకిని జూపెను. పోతనామాత్యుడు నాగటికాడికి గట్టిన రెుుక దున్నను వదలుమని కుమారునితో జెప్పెను. దున్న యొక్కటి లేకయే నాగలి సాగుచుండెను. శ్రీనాథు డదిగాంచి తన పాలకి రెండవ కొమ్మును గూడ విడువు డని వాహకులని హెచ్చరించెను. బోయ లట్లే చేసిరి. పాలకి యప్పటి యట్ల

నడచుచుండెను. పోతనయు దన కుమారునకు నాగటికి మరి యొకప్రక్క నున్న దున్నను విడువు మని చెప్పెను. పశువులు లేకయే అరక సాగుచుండెను. తనకువలె పోతనకును సామర్థ్యము గలదని శ్రీనాథుడు దెలిసికొనెను. ఆతడు పోతనను సమీపించి వేళాకోళముగ "హాళికులు సుఖముగ నున్నారా?" యని కుశలప్రశ్న వేసెను. పోతనామాత్యు డాప్రశ్నకు బద్యమున సమాధాన మిచ్చెను.

"బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
కూళల కిచ్చి యప్పడుపుగూడు భుజించుటకంటె సత్కవుల్
హాళికులైన నేమి గహనాంతరసీమల గందమూలకౌ
ద్దాళికులైననేమి నిజదార సుతోదర పోషణార్థమై"

పోతన్నను శ్రీనాథుడు తన కౌగిట జేర్చుకొని "బావా! వేళాకోళముగా నట్లంటిని. కోపము వచ్చినదా యేమి?" అని యాతని నోదార్చెను.

"పోతన్నబావా! కమ్మని గ్రంథము వ్రాసి యేనృపతికైన గృతియిచ్చిన బాగుండును. ఇట్టి మహాత్ములు వ్యవసాయము జేయనేల?" అని శ్రీనాథుడు పలికెను. ఆయన పోతనతో వారింటి కేగెను.

పోతన్నయింట బాకసామగ్రి యేమియు లేదు. అతడు మల్లన్నను బిలిచి ఋణము దెమ్మని పంపెను. మల్లనకు ఋణ మెచ్చటను దొరకలేదు. పోతన "బావగారూ! మీరు స్నానముజేసి మడికట్టుకొని రండు" అని హెచ్చరిం

చెను. శ్రీనాథుడు, అతని పరివారమును జెరటిలో స్నాన మున కేగిరి. పోతనకవీంద్రుడు భక్తివిశ్వాసములతో సరస్వతీదేవిని బ్రార్థించెను. అంతట వాగ్దేవి సాక్షాత్కరించి వంటయింటికి తెర గట్టవలసిన దని చెప్పెను. వెంటనే పోతన వంటయింటి) తెర గట్టించెను. శ్రీనాథుడు స్నానముజేసి, మడికట్టుకొని, పరివారముతో వచ్చెను. అప్పటి కింకను పొయ్యిలో పిల్లి కదలలేదు. ఇంటిలోనివా రందరును బారులు తీర్చి కూర్చుండిరి. వంటయింటి తెరమాటుననున్న సరస్వతీ దేవి యమృతహస్తముతో షడ్రసోపేతమగు నాహారము పోతనభార్య కందీయసాగెను. ఆమె అందరికిని వడ్డింప దొడగెను. నిప్పచ్చరముగ నున్న యింట షడ్రసోపేత మగు భోజన మెట్లు సమకూడె నని శ్రీనాథుడును, అతని పరివారమును మిక్కిలి యద్భుతపడిరి.

ఆయన "బావా, పోతనా! ఇడుమల బడకుండ కర్ణాటక ప్రభునకు భాగవత మంకిత మిమ్ము. ఇహసుఖముల వదలుకొనెద వేల బావా?" అని పోతనను హెచ్చరించెను. వెంటనే సరస్వతీదేవి కన్నీరుమున్నీరుగా దుఃఖించుచు పోత నకు సాక్షాత్కరించెను. పోతన సరస్వతి నుద్దేశించి,

"కాటుకకంటి నీరు చనుకట్టుపయిం బడ నేలయేడ్చె దో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల, యోమదంబ, యో
హాటకగర్భురాణి, నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాతకీచకుల కమ్మ త్రిశుద్ధిగనమ్ము భారతీ!"

అని యామె నోదార్చెను. శ్రీనాథుడు వగచి తన యూరు చేరెను.

౨

పోతరాజుగారి భక్తి ముదిరెను. తాళపత్రములపై గంటముతో వ్రాయుచు మహాకవి పరవశుడై కొంతసేపు వ్రాయలేక కన్నీరు కార్చెడివాడు. అతని చిత్తము శ్రీరామచంద్ర పాదారవింద చింతనమున మునిగిపోయెడిది. లేత మామిడిచిగుళ్లు దినమరిగిన కోయిల ఇతర వృక్షముల దరికి బోవునా? పున్నమనాటి నిండువెన్నెలరుచి మరిగిన వెన్నెల పులుగు మంచుజడి కోరునా? నిర్మలాకాశగంగాతరంగములపై విహరించు రాజహంస భూలోకమందలి నదులపై విహరింప గోరునా? మందారపుష్పములలోని జుంటితేనియ రుచి మరిగిన తుమ్మెద మదనములకు పోవునా? అట్లే పోతనకవి మానసము భగవంతుని చింతనయనెడి యమృత సరోవరమున మునిగిపోవుచుండెను. అతనికి సంసారము భారముగ దోచెను. పోతరాజుగారు పొలముపనులు చూచుకొనలేకుండిరి. మల్లనపై కుటుంబభారము పడెను.

పోతనామాత్యుడు దశమస్కంధము వ్రాయుసమయమున శరద్రాత్రి వచ్చెను. అంచరెక్కవలె, మునిమానసమువలె శరద్రాత్రి నిర్మలమై మహాసుందరముగ నుండెను. మహాకవి పల్లె విడిచి పండువెన్నెలలో పచ్చని చేలుగాంచుచు కాలువగట్టున బండపై గూరుచుండెను. శరద్రాత్రి గానము

చేయు గృష్ణునిదరికి వచ్చు గోపికాంగనల ఘట్టమును మహాకవి మనసులో దలచుకొని పొంగిపోయెను. ఆయన కొంత వడికి భక్తిపారవశ్యములో గోపిక నని దలంచెను. వెంటనే పోతన్నగారి హృదయము వెన్నవలె కరగిపోయెను.

'నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళిపరిసర్పిత పింఛమువాడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకడు చెల్వల మానధనంబు దెచ్చెనో
మల్లియలార మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే'

అను పద్యము పోతన తనలోతాను పాడుకొని మురిసెను. వెన్నెలలో పోతన పరవశుడై కృష్ణునికౌగిట నున్నటుల భావించెను. ఆయన స్వగృహమునకు మరలక కూర్చున్నవాడు కూర్చున్నట్లే యుండెను. మల్లన తండ్రికై వెదకి యూపొలిమేర నున్న కాల్వదరికి వచ్చెను. అతడు తండ్రిని వెంటబెట్టుకొని యింటికి దీసికొని వెడలెను. త్రోవలో కవీంద్రుడు తెల్లని యావులను లేగలను జూచి బృందావనమందలి గోవు లని దలచెను. ఆయన పిచ్చివానివలె నుండెను. మహాకవి త్వరగా భాగవతము ముగించి యేకశిలానగరవాసులకును, బమ్మెర వాస్తవ్యులకును మృష్టాన్న సంతర్పణ జేసెను. పూర్వమువలె సరస్వతీదేవి పోతన్నకు సాక్షాత్కరించెను. ఆ చల్లనితల్లి దయచే పోతన యభీష్టము నెరవేరెను. పోతన కీర్తిచంద్రికలు నలుదెసల వ్యాపించెను.

# 3

ఏకశిలానగరమునకు గొలది దూరములో రాచకొండను సర్వజ్ఞసింగమ భూపాలుడు పరిపాలించుచుండెను. అతడు విద్యాపోషకుడు, స్వయముగా పండితుడగుటచే కవుల నాదరించెను. అతడు పోతన రచించిన భాగవతపురాణమును గృతిగ్గొన దలచెను. భూపాలుడు కవీంద్రుని దన యాస్థానమునకు రావించి గ్రంథమును జదివించి దనకా గ్రంథము గృతియిమ్మని యడిగెను. పోతనకు గోపమువచ్చి గ్రంథము నరుల కంకిత మీయ నని శపథము జేసెను. సభాస్తారులెల్లరును దెల్లపోయిరి. సింగభూపాలుడు భటులను బిలిపించి, పోతనను బంధించి భాగవతమును బాతి పెట్టించెను. కవీంద్రుడు శ్రీరామ పాదపద్మములను స్మరించెను. వెంటనే యతడు బంధముక్తుడయ్యెను. పోతనకు గర్తవ్యము దోపక దుఃఖముతో గ్రుంగిపోయెను. అతనికి నిద్రాహారములు లేవు. పోతన జీవితసర్వస్వమైన భాగవతము నేలలో బూడ్చబడిన కారణమున రాజాంతఃపురమున గొప్ప మార్పు కలిగెను. శ్రీరామచంద్రుడు సింగభూపాలుని భార్యకు స్వప్నమున గనబడి, రాజును వేడి భాగవతము లోకమున వ్యాపింపజేయమని జెప్పి యదృశ్యుడయ్యెను. రాణి సంతోషముతో గలలో జరిగినదెల్ల సింగభూపతికి దెలియచేసెను.

మహారాజు భాగవతమును కవి కొసంగెను. పోతన పదిలముగా భాగవతమును దేవతార్చనపెట్టెలో బెట్టి పూజిం

చెడివాడు. అవసానకాలమునం దతడు తనకుమారుని బిలిచి తా నార్జించిన ధనమును కాపాడు మని చెప్పెను. పోతన కుమారుడు కొంతకాల మైన తరువాత భాగవతమును బైకి దీసెను. ఆ తాటియాకుల పొత్తములో కొంతభాగమును పురుగులు తినివేసెను. వెలిగండల నారయ యనుకవి భాగవత భాగములను బూరించెను. పోతనామాత్యుడు దరిదాపు 500 సంవత్సరముల క్రిందట పరమపదించినను భాగవత రూపమున నతనికీర్తి లోకములో నిలిచియున్నది.

---

## శ్రీనాథ కవిసార్వభౌముడు

౧

సామ్రాజ్యములు కూలిపోయినను సరసకవిత్వము శాశ్వతముగా నుండును. సరసకవులలో శ్రీనాథుడు కవిసార్వభౌము డన్న మేటికీర్తి గడించినాడు. అయిదువందల సంవత్సరముల క్రిందట ఆంధ్రదేశమున సముద్రతీర ప్రాంతమున కాల్పట్టణమున మారయ భీమాంబలకు జన్మించెను. అతని తాత కమలనాభుడు మహాపండితు డనియు కవిశేఖరు డనియు వన్నెకెక్కినాడు. శ్రీనాథుడు గొప్పగా వేదవేదాంగముల నభ్యసించెను. తరతరములనుండి సంప్రదాయ సిద్ధముగ వారిల్లు వేదశాస్త్రములకు బుట్టినిల్లు. తాత ముత్తా

తలు కవు లగుటచే కవికులములోని శ్రీనాథునకు సహజము గనే కవిత జెప్పుట యలవడెను కోయిలకు గానము నేర్ప నవసరము లేదుగదా! అతని తాత లీశ్వరా రాధకులు. పెద్ద లేదిచేసిన పిన్నలు దాని ననుకరింతురు. శ్రీనాథునకు నీశ్వరార్చన మన్న బ్రీతి యధికమయ్యెను. అత డుదయమున లేచి నిత్యకృత్యముల దీర్చుకొని వేదాధ్యయనము జేయుచుండెను. పదునెనిమిది వత్సరములు రాకపూర్వమే శ్రీనాథుడు సరస్వతీ వరప్రసాదమున వేదవేదాంగముల నేర్చెను. అతడు బ్రహ్మాండాది మహాపురాణముల దాత్పర్యము నిర్ణయింప సమర్థు డయ్యెను. ఈశ్వరానుగ్రహమున మానవుడు సమస్తజ్ఞానమును బొందగలడు. అతని రూపమునకు దోడు విద్యాసంపద, సౌశీల్యాది గుణములు బంగారమునకు బరిమళమువలె నుండెను.

ఒకనాడు దుగ్గన్న కృష్ణాతీరమందలి దగ్గుపల్లి నుండి కాల్పట్టణమునకు శ్రీనాథుని కడకు విచ్చేసెను. బావమరది వచ్చుటచే శ్రీనాథుడు సంతసించి "బావా! దారితప్పి వచ్చినావు. నాకై కాకున్నను మీ అక్కను జూచిపోవుటకైన వచ్చితివి" అని పలికెను. దుగ్గన "బావగారూ! మీలో సగము మా అక్కయ్య. మిమ్ములను చూచిన మా అక్కను చూచినట్లే. మీకు బూర్వపుణ్యమున వేదాది విద్యలు లభించినవి. పాండిత్యమునకు దోడు కావ్యములు వ్రాయుచుంటిరని వింటిని" అని పలికెను.

"బావా! అప్రయత్నముగ సీసపద్యములల్లు చున్నాను. క్రొత్తకావ్య మీనడుమ నారంభించితిని. సరస్వతీ కటాక్ష మెట్లుండునో."

"బావగారూ! మీ నాలుకపై సరస్వతి నాట్యమాడును."

"దుగ్గనా! నే నామె కాలియందెల మృదుస్వరము వినగలిగినచో కృతార్థుడను. బావా! అప్పుడు నీవు నావద్ద శుశ్రూష చేయవలసివచ్చును సుమా."

"అట్లే శుశ్రూష చేసెదను. మీ కవిత్వము నాకు నేర్పుడు."

శ్రీనాథుడు తాను వ్రాయుచున్న మరుత్తరాట్చరిత్రలో కొన్ని ఘట్టములు జదివి వినిపించెను. కావ్యగానము చేయునపుడు శ్రీనాథుని ముఖమండలము బాలసూర్యుని కిరణములచే నందమొలుకు కమలవనమువలె నుండెను. ఉద్రేకమున నతని కన్నులు చెమ్మగిల్లెను. దుగ్గన సంతోషమునకు బట్టపగ్గములు లేవు. కొంతసేపటికి దుగ్గన "బావగారూ! నే నొక సలహా నీయదలచితిని. నా సాహసమునకు మన్నింపుడు. కావ్యములు రచించి చందుకాపెట్టెలో బెట్టి పూజించుటకన్న ఏ కొండవీటిరెడ్డి రాజులకో అంకిత మిచ్చిన మీకు కీర్తిసంపదలు వచ్చునే?"

"నిజమే. కాంచీపురినుండి వచ్చిన అవచి తిప్పయ సెట్టి నా బాల్యస్నేహితుడు. నన్ను కొండవీటికి గొంపోయెద నని జెప్పినాడు."

"బావగారూ! శుభస్య శీఘ్రమ్. అవలంబనము లేని కవిత శోభింపదు."

"పండితుల పక్షములోను, వనితా లతల విషయము లోగూడ నంతే సుడీ" అని శ్రీనాథుడు చిరునవ్వు నవ్వెను.

"తిప్పయసెట్టికిని కొండవీటి ప్రభువైన కుమారగిరి కిని మంచి నేస్తమున్న దని వినికిడి."

"అవును. అతడు కుమారగిరిచేయు ప్రతి వసంతో త్సవమునకు దగిన కస్తూరీ కుంకుమ గంధసారాది సుగంధ ద్రవ్యము లొడగూర్చును. తిప్పయశ్రేష్ఠి దక్షిణమున సింహ ళము నుండియు, నుత్తరమున పండువా, ఢిల్లీ నగరముల నుండియు సరకులు నావపై గొనితెచ్చును. ఈతని ప్రభా వము హరిహరరాయలు, సులతాను పిరోజిషహా, కళింగ ప్రభువులు గజపతు లెరుగుదురు."

"బావగారూ! కుమారగిరి రసికప్రభువు. అతడు వసంతోత్సవము జేయుచున్నాడట. మీ రాయుత్సవము నకు బోయిన సకలార్థములు జేకూరును."

"తిప్పయసెట్టి కుమారగిరిప్రభువు వద్ద సుగంధ భాండాగారమున కధ్యక్షుడు. మన కేమియు లోపముండదు.

వేదశాస్త్రములు నేర్చినను ఇహలోక సుఖము వదలువాడను కాను. తప్పక రాజాశ్రయ మపేక్షింతును,'' అని శ్రీనాథుడు పలికెను. దుగ్గన రెణ్ణాళ్ళు శ్రీనాథునితో గడపి దగ్గుపల్లికి వెడలెను.

౨

కొండవీటిలో జరుగు వసంతోత్సవమునకు దిప్పయ సెట్టి శ్రీనాథుని వెంటబెట్టుకొని వెళ్ళెను. సెట్టి వసంతోత్సవ సందర్భమున రెడ్డిరాజయిన కుమారగిరికి శ్రీనాథుని నెరుకపరచెను. ప్రభువు కవిని మిక్కిలి యాదరించెను. వసంతోత్సవవేళ లకుమాదేవి యను నాట్యాంగన సభాసదులను రంజింపజేసెను. కుమారగిరి రచించిన నాట్యశాస్త్రము ననుసరించి లకుమ సవిలాసముగ నాట్యమొనర్చెను. శ్రీనాథుడు రసికప్రభుని స్నేహము సంపాదించెను.

కుమారగిరి గతించిన బిదప పెదకోమటి వేమభూపాలుడు కొండవీటికి ప్రభు వయ్యెను. ఆయన విద్యాపోషకుడనియు, విద్యారసికు డనియు, సర్వజ్ఞుడనియు ఖ్యాతి గాంచినాడు. అతడు స్వయముగ సంగీత సాహిత్య గ్రంథము లెన్నెన్నో రచించినాడు. అదృష్టవశమున శ్రీనాథుడు పెదకోమటి వేమునకు ప్రీతిపాత్రు డయ్యెను. కవీంద్రుడు 'శాలివాహన సప్తశతి' యను కావ్యమును రసవంతముగ వ్రాసి భూపాలునకు అంకితమిచ్చెను. పండితులు కవులును నానాదేశముల నుండియు రాష్ట్రముల నుండియు కొండవీటికి

రాజదర్శనార్థము వచ్చిరి. శ్రీనాథుడు భూపాలుని యానతి చొప్పున విద్యాధికారిగా నియమింపబడెను. విద్యాధికారి పలువురు పండితుల పాండిత్యమును బరీక్షించి, సన్మానార్హులైనవారిని వేమభూపతి కెరుకపరచును. శ్రీనాథుడు పండితులకు భూరిదానములు మహాగ్రహారములు కానుకలుగా నిప్పించెను. అతడు దానశాసనకృతులను సంస్కృతభాషలో రచించెను. విద్యాపోషకుడైన రాజాదరణచే శ్రీనాథుని కీర్తి చంద్రికవలె నలుదిక్కులకు బ్రాకెను.

## 3

ఒకసారి శ్రీనాథుడు కొండవీటి గాడిదను జూచి కుకవులను వేళాకోళము జేసెను.

'బూడిద బుంగలై యొడలు పోడిమిదక్కి మొగంబు వెల్లనై
వాడలవాడలం దిరిగి వారును వీరును చొచ్చొచోయనన్
గోడల గొందులం దొదిగి కూయుచు నుండెదు కొండవీటిలో
గాడిద నీవునుం గవివి కావుగదా యనుమాన మయ్యెడున్'

శ్రీనాథుని వేళాకోళముచే కుకవుల తలలు వాలినవి. భూపాలుడు కవీశ్వరుని చమత్కారమునకు సంతసించెడివాడు. ఒకసారి శ్రీనాథుని గౌరవార్థము విస్సనమంత్రి యను కరణము విందుచేసెను. విప్రులు పంక్తిభోజనము సిద్ధముచేయుటలో అందెవేసినవారు. బంగారు పళ్లెరములలో గప్పురభోగి వంటకము వడ్డించిరి. కాచిన ఆవునేయి,

పెసరపప్పు, చక్కెరకేళీ, యనటి పండ్లతో, అప్పడములు, వడియములతో విందు రుచిగా నుండెను. పంక్తిలో నున్న వారిలో రామయమంత్రియను కరణము భోజనశూరు డగుట వలన శ్రీనాథుడు మందహాసము జేయుచు చాటుపద్యము నాశువుగ జెప్పెను. పంక్తిలో గూర్చున్నవారి కడుపులు చెక్క లయ్యెను.

'గ్రామము చేతనుండి పరికల్పిత ధాన్యము నింటనుండి శ్రీ
రామ కటాక్ష వీక్షణ పరంపరచే గడతేరెగాక మా
రామయమంత్రి భోజనపరాక్రమ మేమని చెప్పవచ్చు నా
స్వామియెరుంగు తత్కబళచాతురి తాళఫల ప్రమాణముల్'

ఈ రీతిగ కవీంద్రుని వాక్కులలో హాస్యము జాలువారు చుండెను.

౪

వేమభూపాలుడు కాశీ క్షేత్రమునకు బోదలచెను. ఆయన తనవెంట శ్రీనాథుని దీసికొని వెళ్ళెను. కవీంద్రుని చతురోక్తులు రాజేంద్రుని మార్గాయాసమును బోగొట్టెను. రాజేంద్రుడును కవిచంద్రుడును వారణాశీ క్షేత్రమున మణి కర్ణికాది పవిత్ర ఘట్టములలో పుణ్యోదకస్నానములు సల్పి కాశీవిశ్వేశ్వరుని దర్శించిరి. వేమభూపతి శివప్రీతికై అర్చనలు సలిపెను. శ్రీనాథుడు కాశికాక్షేత్రపు మహాత్మ్య మును స్మరించెను. అత డీశ్వరభక్తుడు కనుక భక్తిపారవశ్య మున 'కాశీఖండ' మను మహాకావ్యము రచించెను. కాశీ

ఖండము పండితులపాలిటి 'అయఃపిండ' మను సామెత ప్రసిద్ధ మైనది. వేమభూపాలుడు కవిచంద్రునిగూడి కొండవీటికి విచ్చేసెను. భూపాలుడు శ్రీనాథునకు మైలవరము, సంక్రాంతి పాలెమను నగ్రహారములను గానుకలుగా నీయదలచెను. శ్రీనాథుడు భోగపరాయణు డైనను ఇతర పండిత కవులవలె అగ్రహారములు స్వీకరింపలేదు. రాజాశ్రయమున్న తన కగ్రహారము వేరే వలదని కవీంద్రుడు రాజేంద్రునకు దెలి పెను. క్రమక్రమముగా కవికీర్తి దిగంతముల మెరసెను.

కాల మొక్కతీరుగ నుండదు. కాలప్రేరితమై సుఖ దుఃఖములు వచ్చుచు బోవుచుండును. రాజమహేంద్రవరము నేలెడి అల్లాడ రెడ్లకు, వెలుగోటి వెలమలకు గజపతులకును గొండవీడు కన్నెఱ్ఱగా నుండెను. అల్లాడ రెడ్లకును, గొండ వీటి రెడ్డిరాజులకును మధ్య పచ్చగడ్డి వేసిన భగ్గున మండు చుండెను. ఆకస్మికముగ నల్లాడవారు కొండవీటిని ముట్ట డించిరి. యుద్ధమున పెదకోమటి భూపాలుడు పరాజితు డయ్యెను. తుద కాయన పరాజయము భరింపలేక ప్రాణ ములు విడిచెను. కొండవీట గల్గిన విప్లవము శ్రీనాథునకు హృదయతాపము కలిగించెను. కంటికి రెప్పవలె తనను రక్షించి పోషించిన పెదకోమటి వేమభూపాలుడు మరణించు టచే శ్రీనాథుడు బాధతో క్రుంగెను. ఆయన మరల ధైర్యము బూని కొండవీట నుండలేక కట్టుబట్టలతో దేశా టనము జేయసాగెను. ఆయన కాత్మాభిమాన మున్నను దారిద్ర్యబాధ కోర్వలేక రాజాశ్రయము గోరుచుండెను.

౫

విద్యానగరమును ప్రౌఢదేవరాయలు పరిపాలించు చుండెను. శ్రీనాథుడు కర్ణాకర్ణిగా రాయలు విద్యాపోషకుడని దెలిసికొనెను. ఆయన దేవరాయల మందిర ద్వారముకడ రాజదర్శనార్థము వేచియుండెను. దేవరాయలు సమాధాన మీయనందున కవీంద్రుడు కోపోద్రేకముతో నొక సీసపద్యము రచించి పంపెను. కవుల వాదము విన వేడురగలదేని రాజదర్శన మీయవలె నని శ్రీనాథుడు పద్యమున సూచించెను.

దేవరాయలు ముత్యాలశాలలో కవి పండిత గాయక నటాదుల తోడను, మంత్రివర్గము తోడను బేరోలగంబున నుండెను. శ్రీనాథుడు ఠీవిగా రాజసభలో బ్రవేశించి ఆస్థాన కవీశ్వరు డైన డిండిమ భట్టారకునితో వాదము జేయుదునని బల్కెను. డిండిమభట్టు వాదమునకు సిద్ధముగ లేడు. శ్రీనాథుడు తాను కవిచక్రవర్తినని సభలో జెప్పగా డిండిమ భట్టునకు దల కొట్టివేసిన ట్లయ్యెను. శ్రీనాథునితోడి వాదములో డిండిమభట్టు ఓడిపోయెను. దేవరాయలు ముత్యాల శాలలో చంద్రశిలాపీఠముపై శ్రీనాథుని గూర్చుండ బెట్టి దీనారటంకాలతో కనకాభిషేకము జేసెను.

౬

శ్రీనాథుడు స్థిరముగా రాజాశ్రయము సంపాదింప నెంచి కర్ణాటదేశ సంచారము చేయుచు రాచకొండ ప్రభు

వయిన సర్వజ్ఞసింగ భూపాలుని దర్శించెను. సంపదలు బుద్బుద్ప్రాయము లని గుర్తెరిగినవాడు గనుక కవీంద్రుడు ధనము దాచుకొనలేదు. అతడు సంపాదించిన ధనము దోడి మిత్రులకు, శిష్య పరివారమునకును, సంసారమునకును వెచ్చించెను.

కవిచంద్రుడు పాండిత్యముచే, కవితాశక్తిచే రాజదర్శనము చేసి సంపద బొంద దలచెను. శ్రీనాథుడు ప్రభునకు వందన మాచరించి, శారదాదేవిని మనసులో నూహించి సీసపద్యమును జెప్పెను.

"దీనార టంకాల తీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పగుల గొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచు ఢక్క
చంద్రభూషణ క్రియాశక్తి రాయల యొద్ద
పాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
పలుకుతోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమందు
నెటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురుంబ శారదాంబ."

సింగమహీపాలుడు సమస్య నొకదానిని బూర్తిచేయు డని శ్రీనాథుని గోరెను. వెంటనే కవీంద్రుడు సమస్యాపూరణము చేసి రాజేంద్రుని మెప్పించెను. ఆస్థానమున పలువురు శ్రీనాథుని కీర్తిప్రశస్తి గాంచలేక అసూయావశు లైరి.

శ్రీనాథుడు రాచకొండలో నుండ వీలుగా దయ్యెను. సంసారమును, శిష్యపరివారమును బోషించుటకు వలయుధన మతనికి లేకపోయెను. అతడు రాజమహేంద్రవరము చేరి ప్రభువైన వీరభద్రారెడ్డి దర్శన మపేక్షించెను.

౭

రాజమహేంద్రవర ప్రభువయిన వీరభద్రారెడ్డికి మంత్రిగా శ్రీనాథుని బంధువయిన బెండపూడి అన్నయామాత్యు డుండెను. వెతుక బోయిన తీగె కాలికి దగిలినట్లు శ్రీనాథుని కోరిక దీరున ట్లుండెను. మహాకవి తాళపత్రములు దస్త్రములో పెట్టుకొని అన్నయామాత్యుని జూచుటకై తిరిగెను. శ్రీనాథుడు మొదట మంత్రి దర్శనము జేయనెంచి రాజమందిరమునకు వెడలుచుండగా నాగరకులయిన పలువుర బ్రాహ్మణోత్తములను జూచెను. వారు దర్భపెట్టెడు వ్రేళ్ళ మాణిక్యాంగుళీయకములను, నొసల విభూతిరేకలకు మారు కస్తూరికా పుండ్రములను, జందెములతో పాటు ముత్యాల హారములును, గోష్పాద మంత సిగలతో కమ్మని క్రొత్త చెంగలువలు ధరించి గోదావరీ తటమున గాన్పించిరి. వీరభద్రారెడ్డి యేలెడి రాజ

మహేంద్రవర మెంత పూర్వపుణ్యము జేసికొన్నదో యని శ్రీనాథు డచ్చెరువందెను.

రాజప్రాసాదమున అన్నయామాత్యుడు సంతోషాశ్రువులతో శ్రీనాథుని సన్మానించెను. శ్రీనాథుడు బంధుప్రీతిగలవా డగుటచే హృదయ ముప్పొంగ పొంగిపోయెను.

"అన్నయామాత్యా! చల్లని నీదర్శనముచే నా హృదయము నెమలివలె ఆనందముతో పురులు విప్పినది" అని పలికెను. అన్నయమంత్రి కవీంద్రుని తరళనేత్రములను గాంచెను.

"కవిచక్రవర్తీ! శ్రీనాథా! పెదకోమటి వేమభూపాలున కఖిల పురాణవిద్యాగమములు వినిపించినావు. శ్రీహర్షుని సంస్కృత నైషధ మాంధ్రము జేసి సింగనమంత్రి కిచ్చితివి. కీర్తికర్పూరములు దిశలందు విరజిమ్మినావు. మనము పాకనాటి వారము. బంధువులము. నా కానందముకలుగ నీవొక కావ్యము నాకు గృతి నిమ్ము" అని ప్రార్థనాపూర్వకముగ బలికెను. శ్రీనాథుడు కావ్యమును బెండపూడి అన్నయమంత్రి కిచ్చుటకు సమ్మతించెను.

అన్నయమంత్రి దక్షారామమున భీమేశ్వరాలయమంటప నిర్మాణము జేయదలచి కవీంద్రుని వెంటబెట్టుకొని వెడలెను. మహాకవి శ్రీనాథుడు దక్షవాటీమహాత్మ్యమును గూర్చి 'భీమఖండ' మను కావ్యము రచించి అన్నయకు

గృతి యొసంగెను. శ్రీనాథుడు మంత్రితో దిరుగుట రాజ మహేంద్రవరమందలి పండితులకు నీర్ష్యగా నుండెను. కొందరు పండితులు చాటుమాటున కవీంద్రుని బరిహాసము జేయసాగిరి. అతడు వాక్చాతుర్యముచే పండితుల వాక్కులు బంధించెను.

అన్నయామాత్యుడు రెడ్డిరాజైన వీరభద్రునకు శ్రీనాథుని కవితాశక్తి దెలిపెను. ప్రభువు స్వయముగా బండితు డగుటచే శ్రీనాథుని కవితాగానము వినవలెనని కుతూహలపడి కవీంద్రు నాహ్వానించెను. శ్రీనాథుడు వేమ భూపతి కృపావీక్షణముచేతను, భీమేశ్వరస్వామి యందలి భక్తిప్రభావము వలనను మధురముగ కవిత జెప్పెను. రాజసభ చంద్రశాలాప్రదేశమున నేర్పాటయ్యెను. మంత్రులు, సేనాధీశులు, సామంతులు, దండనాయకులు, పండితులును సభ నలంకరించిరి. శ్రీనాథుడు సభలో నుచితాసనమున నాసీనుడయ్యెను. కస్తూరి కర్పూర సుగంధ ధూపాదులతో రాజసభ పరిమళించెను. మంగళరవములు చెలరేగ శ్రీనాథుడు 'కాశీఖండ' మను కావ్యమును వీరభద్రారెడ్డికి గృతియొసగెను. వీరభద్రారెడ్డి కృతిగొన్న కావ్యము చేత బూని బంగరు పాలకి నెక్కి యూరేగెను. ఉత్సవానంతరము ప్రభువు శ్రీనాథకవికి రత్నాంగుళీయకమును చీనాంబరములను కానుకగా నొసగెను. శ్రీనాథుడు పదిపండ్రెండు వత్సరములు రెడ్డిప్రభువువద్ద నుండి మహాభోగముల ననుభవించెను.

వీరభద్రారెడ్డికి దాయాదియొకడు అన్నెదేవు డనువాడు భామినీ సుల్తానులలో నొకనితో నెయ్యము జేసి తురుష్కసేనతో రాజమహేంద్రవర దుర్గమును ముట్టడించెను. ఘోరయుద్ధము చెలరేగెను. వీరభద్రారెడ్డి రణరంగమున బ్రాణములు గోల్పోయెను. వీరభద్రునివంటి రాజపోషకుని బ్రాణసమానుని గోల్పోవుటచే శ్రీనాథుడు దుఃఖ మాపుకొనలే కుండెను. రెడ్డిరాజ్య మస్తమించుటచే శ్రీనాథుడు మరల దేశాటనము జేయవలసి వచ్చెను. వీరభద్రు డొసగిన రత్నాంగుళీయకమును జూచినపు డెల్ల కవిచంద్రుని హృదయము కరిగిపోవుచుండెను. రెడ్డిరాజ్య లక్ష్మివైభవము కవికి స్వప్నమువలె దోచెను. రాజ్యసంపదలు క్షణికములని శ్రీనాథునికి విరక్తి కలిగెను. భోగికికూడ విరాగము కలుగక మానదు.

౨

శ్రీనాథుడు విద్యానగర సామంతులైన పంటరెడ్డి, మైలారురెడ్డి యనువారల వద్దకు బోయెను. శ్రీనాథుని దినవ్యయము రెడ్లు భరించుచుండిరి.

శ్రీనాథుడు గంపెడు సంసారముతో శిష్యబృందముతో దేశసంచారము చేసెను. సంచారములో బాధలు పడలేక శ్రీనాథుని భార్య పుట్టినింటికి దగ్గుపల్లి వెడలెను. శ్రీనాథుడు పలనాడు వెడలెను. పలనాటిలో సన్నబియ్యము లభింపవు. అచ్చటివారు జొన్నన్నము తిందురు. క్రొత్త

వారికి జొన్నకూడు తినుట కష్టముగ నుండును. మహాకవి గ్రామపురోహితు నింట బస చేయవలసి వచ్చెను. శ్రీనాథుడు సుందరమైన వస్తువులను జూడగలడు. ఆయన వికృతములగు వానిని జూడలేడు.

శ్రీనాథుడు పేదవాడైనను పురోహితు నింటి కృత్యములు చూచి సహింపలేకపోయెను. ఆయన వెంటనే పద్యము రచించెను.

'దోసెడుకొంపలో పసులత్రొక్కుడి మంచము దూడరేణముల్
బాసిన వంటకంబు, పసిబాలుర శౌచము, విస్తరాకులున్
మాసినగుడ్డలున్, తలకుమాసిన ముండలు, వంట కుండలున్
రాసెడు కట్టెలున్ దలపరాదు పురోహితు నింటి కృత్యముల్'

శ్రీనాథుడు జొన్నకూడు తినలేక చిరాకు పడెను. అతనికి దాహము వేసెను. ఊరిలో మోటనూయి కలదు. అచట పలువురు స్త్రీలు నీటికై జగడమాడు చుండిరి. పాతాళమునుండి నీటిచుక్కలు పైకి రావలెను. శ్రీనాథుడు దప్పికచే బాధపడి పద్య మిట్లు పూర్తిగావించెను. "చేరెడు గంగధార మడుగే మణికర్ణికగా జెలంగు కారమపూడి పట్టణము కాశికదా పలనాటి సీమకున్." ఆయన పలనాటిలో తిరిగి తిరిగి డస్సిపోయెను. కొంతకాలము మొరసరాజ్యములో (కర్నూలు) శ్రీనాథుడు సంచారము జేసి తిండికి మొగము వాచెను.

అతడు సంసారము నీడలేకుండెను. శిష్యసంఘము పెరిగెను. వారందరిని భరించుటకు కవీంద్రునివద్ద ధనము లేదు. శ్రీనాథుడు వీరభద్రారెడ్డి యొసగిన రత్నాంగుళీయకము మాత్రము విక్రయింపలేక పోయెను. అతడు దాని కాంతులు చూచినపుడు రెడ్డిరాజ్యవైభవము స్మృతికి వచ్చుచుండెను. వెనువెంటనే కవీంద్రుని నయనములు బాష్పపూరితము లగుచుండెను. అతనికి వయస్సు చెల్లుటచే తిరుగుటకు శక్తితప్పెను. స్తిమితముగ నొకచోట కడుపులో గంజి కదలకుండ కాలక్షేపము జేయదలచెను. పెదకోమటి వేమునివంటి ప్రభువు, వీరభద్రారెడ్డివంటి కవితాభిమాని, అన్నయవంటి బంధువు, భాస్కరునివంటి మిత్రుడు, తిప్పయవంటి బాల్యమిత్రుడు శ్రీనాథునకు ఇప్పుడు గరవైరి. కవిత కాదరణము లభింపదయ్యె. అతని హృదయమున శాంతిలేదు. అతడు పేదరికమున కోర్వలేక రైతువలె మడిమాన్యము దున్ని స్వయంపోషణ చేసికొన దలచెను. శ్రీనాథుడు కృష్ణాతీరమున బొడ్డుపల్లె యను గ్రామములో నేల గుత్తకు దీసికొని సేద్య మారంభించెను. పసిడిగంటము పూనిన చేయి నాంగలి పట్టవలసి వచ్చెను. కప్పురభోగి వంటకము రుచిచూచిన వాడు, బంగారు తీగెలు రుచిగొన్నవాడు తిండిలేక నగచాట్లు పడెను. అతని దురదృష్టవశమున కృష్ణానది వరదతో బొడ్డుపల్లెలోని భూములను ముంచెత్తెను. పండిన పంట వరదపా లయ్యెను. కవీంద్రుని కన్నులలో నిరాశాశ్రువులు నిలిచెను. వీరభద్రారెడ్డి యొసగిన రత్నాంగుళీయకము దెగ

నమ్మినను శ్రీనాథుడు కంట తడిపెట్టుచు పొలము మీది ఋణము దీర్చలేకపోయెను.

ఒడ్డెరాజులు వచ్చి శ్రీనాథుని పొల మాక్రమించిరి. శ్రీనాథుని బావమరది దుగ్గనకవి 'నాసికేతోపాఖ్యాన' మను కావ్యము రచించి, దానిని ధనవంతునకమ్మి, శ్రీనాథుని రక్షింపదలచెను. దుగ్గన ప్రయత్నము విఫల మయ్యెను. కవీంద్రుని సంసారము చితికి పోయెను. శ్రీనాథుడు జీర్ణకుటీరమున చాపపై బరుండి తుదిపద్యము జెప్పెను.

"కాశికావిశ్వేశు గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయడిచ్చు?
కైలాసగిరి, పంట మైలారు విభుడుండె
దినవెచ్చ మేరాజు తీర్పగలడు?
రంభగూడె తెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కేరాజు ప్రస్తుతింతు?
స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మరి హేమపాత్రాన్న
మెవ్వని పంక్తిగలదు?
భాస్కరుడు మున్నె దేవునిపాలి కరిగె
కలియుగంబున నికనుండ కష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గుమనగ
నరుగు చున్నాడు శ్రీనాథు డమరపురికి"

శ్రీనాథుడు నేత్రములు మూసినాడు. కన్నీరు కవీంద్రుని శుష్క కపోలములపై జారెను. కృష్ణానదిపై సంజచీకటు

లావరించెను. రెడ్డి రాజ్యలక్ష్మి వైభవమువలె సంజకాంతి వలె శ్రీనాథకవీశ్వరుడు లోకమును వీడెను. సామ్రాజ్యములు మంటిపాలయ్యెను గాని కవిసార్వభౌముని కవిత మాత్రము శాశ్వతమై నిలిచినది.



## వేమన కవియోగి

"చంప దగినయట్టి శత్రువు తనచేత
చిక్కెనేని కీడు చేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ! వినుర వేమ!

"ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు
చూడ జూడ రుచుల జాడ వేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేఱయా
విశ్వదాభిరామ! వినుర వేమ!

"పట్టు పట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియ బట్టవలయు
పట్టు విడుటకన్న పడిచచ్చుటయె మేలు
విశ్వదాభిరామ! వినుర వేమ!"

ఇట్టి వేమన పద్యములు నోటికిరాని బాలు రుండరు. ఆంధ్రదేశమున వేమన కవిగాను, యోగిగాను ఖ్యాతి నార్జించెను.

ఈ మహానుభావుడు 14-వ శతాబ్దములో లక్ష్మాంబా తుంగ కేశవులకు గొండవీటిలో జన్మించెను. ఇతడు రెడ్ల కుటుంబమునకు జెందినవాడు. వేమన సంపన్నగృహమున జన్మించినవాడు. ఇతని తల్లిదండ్రులు చదువుకొన్న పండితులు గాకపోయినను, పండితులు, పౌరాణికులు, కవులు మొదలగువారి కాశ్రయ మిచ్చువారు. కావున వేమన చిన్నతనము నుండియు తమయింటికి వచ్చిపోవు చదువుకొన్నవారల సహవాసమున సంస్కారమును బొందినాడు. వేమన కొంతకాల మల్లరచిల్లరగ దిరుగుచు చదువుసంధ్యలు నేర్వలేదు. కొంతకాల మతడు బెత్తపు దెబ్బలు తినకపోలేదు. వేమన బుద్ధి పురాణకాలక్షేపములచే మారెను. ఎంతమారినను బుద్ధి స్థిరపడలేదు. అతడు తనశీలము పాడుచేసుకొనెను.

వేమనకు వదినెగారయిన నరసాంబ యనిన భయభక్తులు మెండు. వేమన నడవడి కామె విచారించి హితము బోధించెను. వదినె చేసిన బోధ బూడిదలో బోసిన పన్నీరయ్యెను. ఆమె యుక్తితో వేమనకు బుద్ధిచెప్ప గలిగెను. క్రమముగా అతనికి స్త్రీజాతిపై విముఖత్వము కలిగెను. తలిదండ్రులు కుమారుని త్రోవకు దేవలయునని యాలోచించి వివాహము చేసిన గొంత మేలుగా నుండునని తలచి వేమనకు బెండ్లి చేసిరి.

కాని యీ వివాహము సుఖముగ పరిణమింపలేదు. వేమన భార్యను ప్రేమించినను, ఆమె మాత్రము వేమనను

వరించలేదు. ఇరుగుపొరుగున నున్న అమ్మలక్కలు, నరసాంబయు వేమనభార్యకు హితము బోధించిరి. కొండ రామెను వేళాకోళము చేసిరి. భార్యను గుమ్మము దాట నీయక తనయదుపులో నుంచుకొనవలె నని వేమన నిర్ణయించుకొనెను. ఆమె యెత్తిపొడుపు మాటలు, బొమ ముడులు, అనాదరణములు ప్రయోగించెను. భార్యకు స్వాతంత్ర్య మీయరాదని అతడు దృఢముగ నమ్మెను.

'ఆలు మగనిమాట కడ్డంబు వచ్చెనా
ఆలుగాదు నుదుటి వ్రాలుగాని
అట్టి యాలి విడిచి యడవి నుండుట మేలు
విశ్వదాభిరామ! వినుర వేమ!'

వేమన 'చెట్టు ముదరనిచ్చి చిదిమిన బోవునా' యని తలచి భార్యను దండించెను. స్వాభిమానముగల రెడ్డికూతురు భర్తయగు వేమన పెట్టు బాధల కోర్వలేకుండెను. 'ఇట్టి యాలితోడ నెట్లు వేగింతురా!' యని వేమన విసిగి వేసరినాడు. ఈ యవస్థలో తన యదృష్టమునుగూర్చి వేమన దీనముగా దుఃఖించెను. భార్యయం దితనికి కలిగిన సంతానముగూడ సుఖకరముగ పరిణమించలేదు. అనుకూల దాంపత్యములేనివారి సంతానమును విచారించువా రెవరు? వారు యథేచ్ఛగా దిరిగిరి. వేమన సంతానమునుగూర్చి పద్య మిట్లు వ్రాసెను,

"ఎండినమ్రా నొక టడవిని
నుండిన నం దగ్నిపుట్టి యూడ్చును జెల్లన్
దండిగల వంశ మెల్లను
చండాలుం డొకడు పుట్టి చదుపును వేమా!"

"సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతు లగుచు బుత్రులొప్ప
స్వర్గ మేటికయ్య సంసారి కింకను
విశ్వదాభిరామ! వినుర వేమ!"

అని పడిన పేరాస లన్నియు వమ్మైపోయెను. వేమన యాస్తిపాస్తులు చితికిపోయెను. అతడు పేదఱికముగూడ ననుభవించెను. ఇదివఱలో తన్నాశ్రయించినవారందరును సహవాసము వదలివైచిరి. వారు వేమనను పరిహాసముగూడ చేసిరి. వేమన వేసరిపోయెను. అతని కొడుకులు దౌర్భాగ్యులైరి. యోగ్యులగు పుత్రులను గన్నవారిని జూచి వేమన కొండంత యాశపడెను.

"ధనములేని పేదతండ్రి గర్భంబున
భాగ్యపురుషు డొకడు పరగ బుట్టి
బహుళ ధనము గూర్చి భద్రమార్గంబున
పరుల కుపకరించి ప్రబలు వేమ."

వేమన కీ కాలమున ధనము స్వార్థముకొఱ కను భావము నశించెను. జన్మ మెత్తినందులకు గతిలేనివారిని పోషించుట

పరమార్థము గదా! వేమన నిలువనీడలేక కడుపు కన్నము లేక, ఉన్నచోటు విడిచి యూరూర దిరిగెడు వారిని గాంచి జాలిపడెను. అప్పుడు వేమన పద్యములో నిట్లు తెలిపెను. 'ఆక లన్నవాని కన్నంబు బెట్టిన, హరుని కర్పితముగ నార గించు.' అన్నదానమునకు మించినదానము లేదని వేమన నిర్ణయించుకొనెను. వేమన పేదఱిక మనుభవించుచు, ఇల్లు వాకిలి లేక ఇడుముల బడుచు, అతిథిపూజ చేయలేకుండెను. ఊరక యింట కుడిచి కూర్చున్న, ధనమురాదని గ్రహించి రాజాశ్రయ మపేక్షించెను. కాని లాభము లేదయ్యెను. అతనికి పెద్ద ఘనవంతులను బొగడగల శక్తి లేకుండెను.

"ఎఱుకలేని దొరల నెన్నాళ్లు కొలిచిన
బ్రదుకులేదు వట్టి భ్రాంతిగాని
గొడ్డుటావు పాలు గోకితే చేపునా
విశ్వదాభిరామ! వినుర వేమ!"

యని అతడు కలవారలను వేళాకోళము చేసెను. ఏతావు నైనను ఒకరిద్దఱి కిచ్చుబుద్ధి యుండిన వారు దుర్మార్గులగు మంత్రులచేతి కీలుబొమ్మ లగుదురు. 'కల్పతరువు క్రింద గచ్చచెట్టు వంటివా' రని వేమన దుష్టమంత్రుల నాక్షేపించెను. సర్వవిధముల సంసారముపై రోసిన వేమన జ్ఞానోపదేశము చేయగల గురువునకై తిరిగెను.

కొండవీటిలో అభిరామయ్య యనుభక్తు డుండెను. అతడు లంబికా శివయోగి యనువానిని మంత్రోపదేశము

నకై సేవించుచుండెను. ఒకనాడా యోగి అభిరామయ్యతో "రేపుదయము వచ్చి యుపదేశము పొందుము" అని చెప్పెను. దానిని పొంచి వినిన వేమన మరునా డభిరామయ్యను బలవంతముగ కొండవీటియందే యుండునటుల జేసెను. వేమన సంతోషముతో లంబికా శివయోగి దరికేగి "అభిరామయ్య తాను రాజాలక నన్ను పంపినాడు స్వామీ" అని చెప్పెను. అప్పు డా శివయోగి "వాడు నిర్భాగ్యుడు. నీవే రారా" అని వేమనకు మంత్రోపదేశము గావించెను. అతని కాకస్మికముగ జ్ఞానము కలిగెను. జ్ఞానియైన వేమన అభిరామయ్యను క్షమాపణ వేడెను. ఈ తీరున వేమన జ్ఞానియై సంసారబంధముక్తు డయ్యెను.

వేమన పాండిత్యములేని కవి. పాండిత్యము లేకున్నను వేమనకు అనుభవము చాలగలదు. ఆంధ్రదేశ మంతయు నించుమించుగా దిరిగి అత డందందు మఠములను స్థాపించి నీతిబోధ చేయసాగెను. అతడు తేటతెనుగు భాషలో పండిత పామరులకు బోధపడు రీతిగా కవిత్వము చెప్పెను. అతడు నీతిబోధకై కవిత్వ ముపయోగించెను. భాషయైనను నాతనికి భగవ దనుగ్రహముచే దానంతట నది సంక్రమించినది. అతని కవిత్వములో దెలుగుభాషలోని జీవము, నుడికారమందలి యందము కనబడును.

"అల్పుడెపుడుబల్కు నాడంబరముగాను
సజ్జనుండు బల్కు చల్లగాను

కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ! వినుర వేమ!"

" గొడ్డుటావు బితుక గుండ గొంపోయిన
పండ్లురాల దన్ను; పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా
విశ్వదాభిరామ! వినుర వేమ!'

వేమన ఉద్దండకవి. కవులు తిట్టెదరని, శపించెదరని శాశ్వత కళంకముపాలు చేయుదురని భయము మన దేశములో ప్రభువులకు ప్రజలకు నుండెడిది. అట్టికవుల నుద్దండకవు లందురు. వేమన యీ తరగతిలోని కవి. అత డాడిన దాట, పాడినది పాట! అతడు తా ననుసరించు పద్ధతియే సర్వోత్తమ మనుకొనును. అతని కేభావ మెపుడు తోచునో దాని నపుడు పద్యముగనో పదముగనో అల్లుకొని సంతసించును.

ఇతరుల దోషములను వేమన తీవ్రముగ కవితలో ఖండించెను. అతడు లోకమందలి దోసగుల నెత్తి చూపుటకు వచనమునకు దగ్గరగా నున్న పద్యములలో జెప్పెను. అతడు 'ఆటవెలది' యను ఛందములో అధికముగా కవిత్వము చెప్పినాడు. పద్యములో భావముల తీవ్రత యుట్టిపడును. అవి యంత తీవ్రముగా నుండుటకు గారణము భావము లతనివే కాని యితరులవి కాకపోవుటయే. భావములు సహజము లగుటచే భాషకు బిగువును, బలమును గలుగును. తీవ్రభావము గలవానికి బిగువైన భాష

సహజముగ వచ్చును. వేమనకు భాష సహజముగ సంక్రమించెను. ఆత డడ్డులేని నాలుకగలవా డగుటచే, కవిత్వములో భావము, భాష ఒకదానితో నొకటి పందెమువేసి కొని హృదయమునుండి వచ్చుచుండెను.

" కోతి బట్టి తెచ్చి క్రొత్తపుట్టము గట్టి
కొండముచ్చు లెల్ల గొలిచినట్లు
నీతిహీను నొద్ద నిర్భాగ్యు లుందురు
విశ్వదాభిరామ! వినుర వేమ!"

తెలుగు మాటలాడ నేర్చిన వానికి వేమనపద్యము లర్థముకానివి యుండవు. అతడు చెప్పు ప్రతి న్యాయమునకును ఒక యుపమానము తప్పక యుండును. ఆ యుపమానముచే పద్యము సొగసుగ నుండి మనసునకు హత్తుకొనును.

" ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు
చూడజూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్య పురుషులు వే" రని కవి చెప్పినాడు.

'పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా?' 'గొర్రె జంకబెట్టి గొల్ల వెదకిన రీతి' వంటి యుపమానములు, సామెతలు వేమన వని ప్రజ లెరిగినను, మెరుగకపోయినను ప్రతినిత్యము వాడుచునే యున్నారు. వేమన మన లనాకర్షించుటకు గారణ మతని హాస్యము. అతని కవిత్వమునకు

హాస్యమువలన బలము చేకూరెను. ఇతరులలో దోషములను బైలువెట్టుటకే హాస్యము మిక్కిలి యుపయోగము. తప్పును ఆకస్మికముగ బైటికి దీసినపుడు మనకడుపు చెక్కలగును. వేమన గొప్ప బోధకుడు, సంస్కర్తయును. అతని కవిత్వములో హాస్యరసము వెల్లివిరియు చున్నది.

"మేక కుతిక బట్టి మెడచన్ను గుడువగా
ఆక లేలమాను నాశగాక,
లోభివాని నడుగ లాభంబు గలుగునా ?"

యని వేమన లోభులను వేళాకోళమెటుల జేసెనోచూడుడు.

"ఆలివంక వారు ఆప్తబంధువులైరి
తల్లివంక వారు తగినపాటి,
తండ్రివంక వారు దాయాది పగవారు
విశ్వదాభిరామ ! వినుర వేమ !"

"పొట్లకాయ రాయి పొడుగు త్రాటనుగట్ట
లీలతోడ వంకలేక పెరుగు,
కుక్కతోక గట్ట గుదురునా చక్కగా
విశ్వదాభిరామ ! వినుర వేమ !"

పై పద్యములో యుపమానము, దానికి దోడు హాస్యము మిక్కిలి యద్భుతము.

వేమన దిగంబరిరై వీధులవెంట వెఱ్ఱివానివలె దిరుగ నారంభించెను. అతడు వెంటవచ్చు శిష్యులప్రశ్నలకు సమా

ధానములు పద్యములలో నిచ్చువాడు. తల్లిగర్భమున దాను బుట్టినప్పుడు మొదట బట్టలేదు, తుదను లేదు; నడుమనేల బట్టకట్టవలె నని తలచి వేమన దిగంబరిగా మారెను. అతడు సన్యాసి యగుటచే బంధములు లేవు. ఆలు బిడ్డలపై నతిమోహమున్నను, ధనవాంఛయున్నను నరుడు మోక్షము పొందలే డని వేమన గ్రహించి బైరాగిగా జీవించెను. అతడు మొదట వైష్ణవభక్తుల యింట జన్మించినను శైవులైన గురువుల యాశ్రయముచే శివభక్తు డయ్యెను. అతడు భక్తినిగాని, నీతినిగాని అరటిపం డొలిచి చేతిలో బెట్టినటుల తేట తెల్లముగ జెప్పెను.

“ గంగిగోవు పాలు గంటెడైనను చాలు
కడవెడైన నేమి ఖరము పాలు
భక్తిగలుగు కూడు పట్టెడే చాలురా
విశ్వదాభిరామ ! వినుర వేమ !”

వేమన దుర్మార్గుల నిట్లు దూషించెను:

“ అల్పజాతివాని కధికార మిచ్చిన
దొడ్డవారి నెల్ల దోచి తిరుగు
జెప్పు దినెడి కుక్క చెఱుకు తీ పెరుగునా
విశ్వదాభిరామ ! వినుర వేమ !”

వేమన కవియోగిగ ఖ్యాతినార్జించి లోకశ్రేయస్సుకై కవిత జెప్పి, కటారుపల్లె యను గ్రామమున యోగ మవలంబించి

శరీరము చాలించెను. వేమన గతించినను అతని శిష్య పరంపర నేటివరకును మన యాంధ్రదేశములో నున్నారు. అతని పద్యములు రాని పండిత పామరు లుండ రనుట అతిశయోక్తి కాదు.

---

## వేములవాడ భీమకవి

" భీమేశ్వరు డీతడు మా
నామమువా డనుచు వ్రాసె నాలుకతుద వా
గ్భామిని బీజాక్షర మా
భీమన దలచినను గల వభీష్ట ఫలమ్ముల్."

నన్ను భీమకవి యని యందురు. నే నుద్దండకవిని. మాది వేములవాడ యను కుగ్రామము. అది గోదావరి మండలము లోనిది. వేములవాడలో సోమన్న యను బ్రాహ్మణు డుండువాడు. ఆయన యేకపుత్రికకు బసితనము ననే పెండ్లి చేసిరి. దురదృష్టవశమున ఆమె విధవ యయ్యెను. సోమన్న భార్య యదివరకే గతించెను. అందుచే నాతడు వితంతువయిన కుమార్తెను దనవద్ద నే యుంచుకొని సంసార భారమును మోయుచుండెను. ఆయన కుమార్తెకు విద్య చెప్పించెను. ఆమె భారత భాగవతములను జదువుచుండ

సోమన్న వినుచు నామె కథము జెప్పుచు కాలక్షేపము చేయుచుండెను. వారి శాస్త్రిపాస్తు లంతగా లేకపోవుటచే నామె కలవారియిండ్ల కేగి వారికి బనిపాటలు చేసిపెట్టుచు, వారి పిల్లల కాటపాటలు నేర్పెడిది. తెచ్చిన కొలదిధనముతో నామె సంసారము నీదుచు, తండ్రికి సేవజేయుచు పవిత్రముగ జీవనము చేయుచుండెడిది.

దక్షారామములో భీమేశ్వరస్వామివారి కల్యాణమహోత్సవ దినములు వచ్చెను. సోమన్న కుమార్తె యిరుగుపొరుగువారితో నుత్సవములను జూడ దలచెను. ఇరుగుపొరుగువారి బలవంతమున ఆమె దక్షారామమునకు నెడలెను.

సంతానములేని స్త్రీలు కొందరు భీమేశ్వరస్వామి కడ సాష్టాంగపడిరి. వారు తమకు సంతానము కలిగిన నేతితో దీపము వెలిగింతుమని మ్రొక్కుకొనుట జూచి, నెట్టి బాగుల వితంతువుకూడ మ్రొక్కుకొనెను. నిజముగా నాతల్లి కేవల మమాయకురాలు. ఆమె గడసరియైన యెడల సంతానము కోరునా? యాయమ్మ మనసు మంచిదే యైనను సంతానము కోరుటచే నుద్దండుడనైన నేను కడుపున బడితిని. నా జనని గర్భిణి యగుట వలన నిరుగుపొరుగున నున్న అమ్మలక్కలు గుసగుస లాడసాగిరి. సోమన ముక్కుపై వ్రేలు వేసుకొని "అమ్మా! యిదేమి ప్రారబ్ధము. అకార్యము జేసితివి," అని పలికెను. "తండ్రీ! నావలన దోషము

లేదు. నా నడవడి నీవెరుగనిది కాదు'' అని యామె చెప్పగా తండ్రి సందేహము తొలగెను.

క్రమముగా మాయమ్మ నడవడి మంచిదికాదని లోకులు కాకులై కూయసాగిరి. లోకులు చెడు జెప్పకొనుటకు జెవులు కోసుకొందురు. ఊరంతయు నట్టుడికిన ట్టుడికిపోవు చుండెను. కొందరు ''పాపపుణ్యములు భగవంతునికే దెలి యును. మనము నోరుజారి పల్లెత్తుమాట పలుకరాదు'' అని యనుకొనిరి. పెక్కుమంది ''వితంతువు చూలాలైనదం హోయి!'' అని సరదాగా వేళాకోళము లాడసాగిరి. తుద కూరిలోని వా రందరును సోమన్నను వెలివేసిరి. ఈ గంద్ర గోళము పూర్తియైన పిదప మా యమ్మ నన్ను గనెను. ఆమె నన్ను పెంచి, పెద్దజేసి, భీమేశ్వరు డని నామకరణము జేసెను.

మాయమ్మ నాకు జదువుసంధ్యలు నేర్పెడిది. నాకు వయసు వచ్చిన తరువాత వీధిలో తోడివారలతో నాడుకొన బోయినపుడు పిల్లలందరు నన్ను 'ముండకొడు' కని వెక్కి రింప దొడగిరి. నిజమే కాబోలు నని నే ననుకొంటిని. ఊరిలో నేయింట పచ్చని తోరణము కట్టినను మమ్ములను బంక్తిభోజనమునకు బిలుచువారు లేరు.

నాకడుపు దరుగుకొని పోయినది. మాయమ్మ దగ్గ రకు బోయి దీనముగా ''అమ్మా! అవధానులుగా రింటిలో పెండ్లికి మనలను పిలువరేమే? మనము కావలసినవారము

కదా'' యని యడిగితిని. తోడనే మాయమ్మకు గన్నుల నీరు గిఱ్ఱున దిరిగెను. ఆమె గడచిన దంతయు బూసగ్రుచ్చి నటుల నాకు జెప్పెను. నాతల్లినోటనుండి విషయ మంతయు వింటిని. నాకాగ్రహము జనించెను. నేను గ్రామముపై గసి దీర్చుకొన దలచితిని. యదార్థమును దెలుపుటకు భీమేశ్వరుడుతప్ప మరెవ్వరును లేరని దలచితిని. నా హృదయ మల్లకల్లోలముగ నుండెను. నిజము తేలినగాని నాకడుపు లోని చిచ్చు చల్లారునట్లు లేదు.

వెంటనే నేను భీమేశ్వరాలయమున కేగితిని. అచట స్వామి నారాధించుచు నిరాహార వ్రతుండనై యుంటిని. స్వామి నాకు సాక్షాత్కరించి ''వత్సా! నీవు నిక్కముగ నా కుమారుడవు. నీ తల్లి పతివ్రతా శిరోమణి. నా యనుగ్రహమున బండితకవివి, త్రికాలవేదివియు నయ్యెదవు. నీపై మోపబడిన యపనింద తొలగిపోవును. నీవాక్కమోఘ మగును'' అని యనుగ్రహించెను. నా సంతోషమునకు బట్టపగ్గములు లేవు. నా కన్నులలో నానంద పారవశ్య మున నశ్రువులు నిండెను. స్వామి నాకు సాక్షాత్కరించి వరము లొసగిన సంగతి మాయమ్మకు జెప్పితిని. నాజనని యానందమునకు మేర లేదు. నేను సంస్కృతాంధ్రములలో బాండిత్యము నేర్చితిని. నాకు సరస్వతీ కటాక్షమున కవిత్వ మబ్బెను.

నే నూరివారిపై గసిదీర్చుకొన దలచి సమయమున కెదురుచూచు చుంటిని.

ఇంతలో నాయూర నొక బ్రాహ్మణుని యింట శుభ కార్యము వచ్చెను. అత డా యూరివారి నందరిని భోజనము నకు బిలిచెను. బారులుతీర్చి ప్రజలు భోజనమునకు గూర్చుం డిరి. ఆకులలో వడ్డన బూర్తియైనది. ఉద్దండుడ నైన నన్ను భోజనమునకు బిలువ నైన లేదు. నేను బ్రాహ్మణుని యింటి తలుపుసందున నుండి చూచి "మీయన్నము సున్నముగాను, మీ పప్పులు కప్పలుగాను" అని బల్కితిని. అమోఘ వాక్కులచే నాకులలో నన్నము సున్నమయ్యెను. పప్పులు కప్పలై గంతులు వేయసాగెను. ఆకులముందు కూరుచున్న విప్రు లందరును దెల్లబోయిరి. అందరును లేచి వీధిలోనికి వచ్చి నన్ను గాంచిరి.

"భీమనా! నీమహిమ యద్భుతము. నీవు మరల సున్నము నన్నముగాను, కప్పలను బిండివంటలుగాను జేయుము. అట్లు జేసినచో నిన్ను మాలో గలుపుకొం దుము" అని నన్ను దీనముగా వేడిరి. నేను వారియం దనుగ్రహముచే శాపము మరల్చితిని. ఆకులలో పదార్థ ములు నిజస్వరూపము దాల్చినవి. నేను విశేష గౌరవము లంది కడుపార పిండివంటలతో భుజించితిని.

నాటినుండియు నా పేరు జెప్పిన తోడనే వేములవాడ లోని వారికే కాక పలుతావులలోని వారలకు భయభక్తులు కలిగినవి. నేను శాపము బెట్టుదునేమో యని నామాట త్రోసివేయ రైరి. నేనాడినది యాట పాడినది పాటగా

సాగుచుండెను. నన్ను ప్రజ లుద్దండకవి భీమన యని బిలువ సాగిరి.

నేను రెండర్థములు వచ్చులాగున 'రాఘవపాండవీయము'ను రచించితిని. ఈకావ్యమును వేంకటాద్రి యను ప్రభువుకు గృతి యొసగితిని. ప్రభువు నన్ను గురించి :

"రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతి కావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యం బిక నందునుం దెనుగుకబ్బం బద్భుతం బంద్రుఁ ద
త్కుం డెవ్వా డిల రామభారతకథ ల్గోడింప భాషాకృతిన్."

అని నన్ను బ్రశంసించెను. శరపరంపరలుగా కావ్యములు వ్రాసితిని. నేను రాజసన్మానమునకై దేశాటనము సాగించితిని. కవిత్వమునకు దోడు భూత భవిష్య ద్వర్తమానముల గూడ జెప్పబూనితిని. 'భీమనాడి' యను జ్యోతిష గ్రంథము రచించితిని. ధనార్జన జేయ గలిగితిని. తెలుగురాయ డను ప్రభు సన్నిధి కేగి కస్తూరికాదాన మడిగితిని. అప్పు డాశువుగా పద్య మిట్లు చెప్పినాను :

"ఘనుడన్ వేములవాడ వంశజుడ, దక్షారామ భీమేశ నం
దనుడన్, దివ్యవిషామృతప్రకట నానాకావ్య ధుర్యుండ, భీ
మన నాపేరు, వినంగ జెప్పితి, దెలుంగాధీశ! కస్తూరికా
ఘనసారాది సుగంధవస్తువులు వేగం దెచ్చిలాలింపరా."

వెంటనే తెలుగురాయడు నాకు వెరచి కస్తూరికాదానము జేసెను. తెలుగురాయని దర్శించిన పిదప నృసింహపురాణమును, శతకంఠ రామాయణమును గూడ రచించి శైవ వైష్ణవ మతవిభేదము లేదని నేను రూఢిచేసితిని. దురదృష్ట వశమున నన్ను 'తిట్టుకవి' యని లోకులు పలుక జొచ్చిరి. నేను చాటువులు పెక్కు రచించి జనులకు భీతి గూర్చితిని.

ఒకసారి చొక్కరాజను ప్రభువును జూడ నేగితిని. ఆయన యుద్యానములో మల్లెసాల స్తంభము మీద గాలు చాచుకొని కూరుచుండి నన్ను జూచెను. "భీమనకవీంద్రా! నీవు మహానుభావుడవు. ఈ స్తంభమును మరల వృక్షముగా జేయగలవా? నీ ప్రజ్ఞ చూడదలతును" అని ప్రభువు పలికెను.

నేను చిరునవ్వు నవ్వి "ప్రభూ! నేనే వేములవాడ భీమకవి నైనచో నీప్రదేశ మరణ్య మగును" అని యర్థము వచ్చురీతిగ పద్యము జెప్పితిని. వెంటనే పందిరిగుంజ కొమ్మల తోను, బత్రములతోను, చిగుళ్ళతోను, ఫలపుష్పభరితమై యరణ్యములో నున్నట్లు మహావృక్ష మయ్యెను. ఆవృక్షములో రాజుగారి కాలు చిక్కుపడెను. ఆయన కాలూడ తీసికొనలేక పోయెను. ఆయన మరల నావృక్షమును బందిరి కంబముగా జేయుమని నన్ను ప్రార్థించెను. నేనప్పుడు,

"శంభువరప్రసాద కవిసంఘువ రేణ్యుడ నైన నా వచో
గుంభన చేయ నెంతో యనుకూలత నొంది తసూనభావనస్

గుంభిని చొక్కనామ నృపకుంజరు పందిటి మల్లెసాలకున్
స్తంభమురీతి నీతనువు దాలిచి యెప్పటియట్లనుండుమా"

అని చాటువు జెప్పితిని. యథాప్రకారము పందిరి స్తంభమేర్పడెను, రాజు కాలూడ దీసికొనెను.

నే నిట్లంటిని : "చొక్కభూపాలా! నాపేరు విని యున్నారు. నేను మేధావి భట్టుకన్న, కవి మల్లుకన్న, కవి భానుకన్న, నరజాములోపల జెరువునీ రింక జేసిన బడబాగ్ని భట్టుకన్న నుగ్రకోపిని. నేను శపింపగలాడ! వట్టిమ్రానున జిగురు పుట్టింప గలను, గిట్టింపగలను. బిరుదు వేములవాడ భీమకవిని." చొక్కరాజు నాకు నమస్కరించెను. నన్నా యన సన్మానించెను. నే నచటనుండి వెడలితిని.

కళింగరాజ్యప్రభువు చోడ కళింగ గంగదేవుని జూడవలెనని కళింగము బోతిని. 'కవీశ్వరుడు వచ్చినా' డని ప్రతీహారితో జెప్పి ప్రభువుకు గబురు చేసితిని. సమాధానము వెంటనే రాదయ్యెను. నాలో గోపము తాండవించెను. కందపద్యము వ్రాసి రాజమందిరములోనికి బంపితిని. కళింగ గంగు వేరొకపనిలో యుండుటచే 'నిపుడు సందడిగానున్నది. సందడి తీరిన తరువాత ర' మ్మని చెప్పుమనెను. నాకోపము మితిమీరెను. అవమానము సహింపలేక రాజకళింగ గంగును శపించుచు నీపద్యము జెప్పితిని :

"వేములవాడ భీమకవి వేగమెచూచి కళింగగంగు తా
సామముమాని కోపమున సందడి తీరిన రమ్ము పొమ్మనెన్

మోమును జూడ దోషమిక, ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్థమం దతనిసంపద శత్రుల జేరుగావుతన్."

నాపద్యము శాపమై తగులగా, శత్రురాజులు కళింగగంగు రాజ్య మాక్రమించుకొని, ముప్పదిరెండు దినములలో నతనిని రాజ్యమునుండి వెడల గొట్టిరి. కళింగగంగు శత్రువులవలన భయముచే మారువేషముతో నూరూర దిరిగెను. ఒకనాటి రాత్రి చీకటిలో మాయింటిముందున్న పాతరగోతిలో భ్రష్ట మహారాజు కాలుజారి పడెను. అంతబ్రతుకు బ్రతికిన రాజేంద్రుని గతి చూచితిరా! నేను పాదములు కడుగుకొనుటకు బైటకు రాగా కళింగగంగు కాన్పించెను.

"నీవెవర" వని ప్రశ్నింప "నేను వేములవాడ భీమకవి చేసిన జోగిని" అని సమాధానమిచ్చెను. నేనప్పుడు "పశుపతి కంటిమంటలును పండితవాక్కులు రిత్తవోవునే?" యని బల్కితిని. రాజు దీనుడై నన్ను యాచింపగా శాపము దీరున ట్లాశీర్వదించితిని. నేను చెప్పినరీతిగా కళింగగంగు భాగవతులతో గలసి సజ్జనగరమునకు వెళ్లెను. అక్కడ నున్న రాజు తన శత్రువు నవమానించుటకై "రాజకళింగగంగు వేషము వేసెదవా" యని భాగవతుల నడిగెను. భాగవతుల నడుమ నున్న కళింగగంగు మారువేషమున నుండుటచే శత్రువులు గుర్తింపరైరి. అందుచే కళింగగంగు తానే యావేషము వేసెదనని చెప్పెను. అతడందులకై గంగుయొక్క దుస్తులను ఖడ్గమును గుఱ్ఱమును కావలసి

యున్న వని చెప్పగా, శత్రురాజు వల్లెయని యంగీకరించి వాని నన్నిటి నతివేగముగా బంపించెను. కళింగగంగు వాటిని ధరించి గుఱ్ఱము నెక్కి వీరావేశమున గోటలోనికి బోయెను. అచటి పరివార మంతయు నది కళింగగంగు వేషముగాదనియు, యదార్థముగ తమప్రభువగు గంగభూపాలుడే యనియు గుర్తించిరి. ఇంతలో గంగు శత్రురాజు శిరమును ఖండించుటయు, నిజసింహాసనము నధిష్ఠించుటయు నవలీలగా జరిగినవి. ప్రజలెల్ల రతనికి 'జై' పెట్టిరి. గంగు తనరాజ్య మీరీతిగా సంపాదించెను. పండితవాక్కు రిత్తవో దనుట కీనిదర్శనము చాలదా ?

" బిసరుహగర్భు వ్రాతయును విష్ణునిచక్రము వజ్రివజ్రమున్
దెసలను రామబాణము యుధిష్ఠిరు కోపము మౌనిశాపమున్
మసకపు బాముకాటును గుమారునిశక్తియు గాలుదండమున్
బశుపతి కంటిమంటలును బండితవాక్యము రిత్తవోవునే. "

పదునొకండవ శతాబ్దములో నే నీపద్యము రచించితిని. ఇది ముమ్మాటికిని సత్యము.

——

# నన్నయ భట్టారకుడు

౧

భారత పురాణేతిహాసములను సంస్కృతమున రచించిన వేదవ్యాసమునీంద్రు డెట్టివాడో, నన్నయభట్టు కూడ నట్టివాడే. తొమ్మిదివందలేండ్ల క్రిందట తూర్పు చాళుక్య సంతతివాడగు రాజరాజు వేగిదేశమునకు రాజమహేంద్రవరమును రాజధానిగా చేసికొని పరిపాలించెను. రాజరాజునకు నన్నయభట్టారకుడు రాజగురువై ఆస్థానకవియై యుండెను. నన్నయ నిత్యము జపతపములు చేయువాడు. వేదాధ్యయన తత్పరుడు. బ్రహ్మాండాది నానాపురాణముల నేర్చినవాడు. లోకజ్ఞానము గలవాడు. సంస్కృతాంధ్ర భాషలయందసమాన పాండిత్యము గలవాడు. నన్నయ నిత్యము సత్యమునే పలుకువాడు. ఆయన గుణములను బట్టి చూచిన తపోధనుడని స్పష్టమగుచున్నది.

రాజరాజను నామాంతరముగల విష్ణువర్ధన మహారాజు మహేంద్రసౌఖ్య మనుభవించుచు మాత్రమే యూరకుండలేదు. ఆశ్రితులను బోషించుటయందును, దానగుణమందును, వర్ణాశ్రమధర్మ రక్షణమందును రాజరాజు సర్వలోకాశ్రయుడని బిరుదు పొందెను. ఆ మహాప్రభువు ప్రజలను బ్రీతితో జూచెడివాడు. ఆయన దిక్కులందు తన యాజ్ఞ వెలిగించెను. ఆతడు విప్రకులము నెల్ల బ్రోచుచు, కవి పండితులకు మహాగ్రహారంబు లిచ్చుచుండెను.

ఒకనాడు మహారాజు సుఖముగా రాజమందిరమున గూరుచుండి కవిపండితసభ నేర్పాటు గావించెను. కవిపండితులేకాక మంత్రి పురోహిత దండనాయక సామంతులుకూడ సభ కేతెంచిరి. వైణికగాయకులు మధురగానము చేసిరి. గానము ముగిసిన తరువాత రాజరాజనరేంద్రుడు కవిచంద్రుడైన నన్నయభట్టును జూచి పలికెను:

“నేను నిర్మలమైన బుద్ధితో పురాణములు గ్రహించితిని. ధర్మశాస్త్రములసార మెఱిగితిని. కావ్యనాటకములు చవి చూచితిని. అయినను నాకు శ్రీమహాభారతార్థము విన నభిలాషగా నున్నది. బ్రాహ్మణోత్తములను బూజించుటయు, భారతశ్రవణము చేయుటయు, ఈశ్వరారాధనమును, దానధర్మము లొనర్చుటయు సాధుజన సంగతియు నాకు బ్రీతికరములు. మా చంద్రవంశ రాజులయిన పాండవోత్తముల చరిత్ర వినదలచితిని. వేదవ్యాస మునీంద్రుని సంస్కృత భారతము నాంధ్రీకరింపుడు. మహాకవీ! మీరందులకు సమర్థులు. ప్రస్తుత మాంధ్రదేశమున వైదికధర్మ మడుగంటు చున్నది. ధర్మసంస్థాపనకై భార తాంధ్రీకరణము చేయుడు.”

నన్నయభట్టు భార తాంధ్రీకరణము చేయుట కంగీకరించెను. మహాకవి లోకములో నధర్మమును జూడలేక పరితపించెను. ఆంధ్రదేశమున దుర్మతములు ప్రబలుటచే మానవుడు భగవంతునియందు విశ్వాసము బోగొట్టుకొనెను.

సామాన్యజనులలో ధర్మమడుగంటెను. రాజరాజనరేంద్రుడు ధర్మోద్ధరణకై భారతము తెనిగింపుమని నన్నయ భట్టారకునకు బ్రోత్సాహ మొసగెను.

భారతము పంచమ వేదము. అది ధర్మసారము. చరిత్రకారులు దానిని చరిత్రయందురు. ఇట్టి మహోన్నత గ్రంథము రచన జేయుటయందు నన్నయకు నారాయణభట్టు సహాయము చేసెను. నన్నయభట్టు గోస్తనీ తీరమున తణుకు సమీపమున యాగము చేసెను.

"నన్నయభట్టుగారు యజనం బొనరించిన చోట జమ్మి చె
ట్టున్నది తణ్కు తూర్పున సమున్నతమైనది దానినీడ నే
నున్న తఱిన్ శిశుత్వమున నున్నతరీతి వరం బొసంగుచున్
నన్ను గృతార్థు జేసితివి నాయుము నీవును భీమనాయకా"

అని పట్టమట్ట సరస్వతీ సోమయాజి తన పృథుచరిత్రమున అవతారికలో నిట్లు వ్రాసినారు. యాగానంతరము నన్నయ రాజమహేంద్రవరమున భారతము వ్రాయ దొడగెను.

నన్నయ కవిత్వము నిండుపున్నమినాటి పండు వెన్నెల వలె మనోహరము. నన్నయ తాను వ్రాయుచున్న భారతములో వసంత వర్ణనమును రాజరాజనరేంద్రునకు వినిపించెను.

'కమ్మని లతాంతములకు మ్మొనసివచ్చు
మధుపమ్ముల సంగీత నినదమ్ము లెసగెన్, చూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి
ముకుళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా

లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము
మధురమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనో భా
రమ్ముల నశోక నికరమ్ములును జంపక
చయమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్.'

'చందన తమాల తరులందు నగరు
ద్రుమములందు గదళీ వనములందు లవలీ మా
కంద తరుషండములయందు ననిమీల
దరవింద సరసీ వనములందు వనరాజీ
కందళిక పుష్ప మకరంద రసముం
దగులుచుం దనువు సౌరభమునొంది జనచిత్తా
నందముగ బ్రోషితుల డెందములు
వందురగ మందమలయానిల మమందగతి వీచెన్.'

నన్నయభట్టు భారతము నందలి యాదిపర్వమును, సభాపర్వమును, అరణ్యపర్వములోని నాలవ యాశ్వాసము వఱకును రాజన రేంద్రున కంకితముగా తెనిగించెను. ఈతడు రచించిన దానిలో శరత్కాలపు వెన్నెల యందమును వర్ణించిన పద్యము కడపటిది.

'శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులన్
జారుతరంబు లయ్యె వికస న్నవకైరవ గంధబంధు రో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచిపూరము లంబర పూరితంబులై.'

దుశ్శాసనుడు కురువృద్ధు లందరును గాంచుచుండ ద్రౌపది యొక్క వలువలు లాగెను. భీముడు ద్రౌపదికి సంభవించిన పరాభవమునకు సహింపలేక దుశ్శాసనుని జంపెద నని యీ రీతిగా బలికెను:

'కురువృద్ధు ల్గురువృద్ధబాంధవు లనేకు ల్చూచుచుండ న్మదో
ద్ధురుడై ద్రౌపది నట్లుచేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝరముర్వీపతిచూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్'

౨

నన్నయ అరణ్యపర్వము వ్రాయుచుండ రాజరాజు నతని సవతిసోదరుడైన విజయాదిత్యు డనువా డోడించెను. రాజరా జాయవమానము సహింపలేక ప్రాణములు విడిచెను. నన్నయ దుఃఖ మాపుకొనలేక పోయెను. రాజరాజ నరేంద్రుని కుమారుడు దక్షిణ దేశమున చోళరాజ్యమం దుండెను. అతనికి దెనుగుభాషపై యభిమానము లేక పోయెను. భాషాపోషణ చేయు ప్రభువు కరవై నందున నన్నయ పరితపించెను. ఆ కారణమున నన్నయభట్టు భారతాంధ్రీకరణము సంపూర్ణముచేయలే కుండెను. నన్నయ వలె తెలుగుభాషలో కవిత్వము చెప్పగలవారు లేరన వచ్చును.

——





# ముక్కు తిమ్మన

"కృష్ణదేవరాయలుం గారి యాస్థాన కవిమైన మీరు ముక్కుమీంద పద్యమేమో చెప్పినారట. మన యింటిపేరు నందివారైనను ముక్కువా రని లోకు లను చున్నారండీ" అని తిమ్మకవి భార్య పకపక నవ్వుచు చమ త్కారముగ బలికెను.

"ప్రేయసీ! నన్ను నందితిమ్మన యని రాయల బంధువులు మిత్రులును బిలుచుట మాని ముక్కుతిమ్మనా యని వేళాకోళము చేయుచున్నారు. ఇంతకును నా పద్యము నాకు ముప్పు దెచ్చినది," అని తిమ్మకవి పలికెను.

"మీ యింటిపేరు లోపింపగా ముక్కు మాత్రము మిగులును. దానికితోడు మీ నాసికకూడ పెద్దదే సుమండీ" అని మణికర్ణిక చమత్కారముగ బలికెను.

"కవి భార్యవు కనుక చమత్కారము నేర్చితివి. ముక్కుమీంది నా పద్యము నాకీర్తికి గారణమైనది సుమా!"

"మీ పద్యభావ మేమో చెప్పండి. మీరు చెప్పిన యెడల నా కర్థము కాకపోదు."

"రమణీ! ఒకసారి సంపెంగకు గోపము వచ్చెను. ఎందుకో తెలియునా? సారంగము రకరకముల పూవుల పరి మళము ఆనందించును. కాని అది సంపెంగ దరికి బోదు. అందుచే కోపముతో సంపెంగ వనములో తపముజేసి యువతీ

మణి నాసికగా మారెను. నాటి నుండియు సంపెంగగా మారిన నాసిక పువ్వులలోని పరిమళము దాల్చి, చూపు లనెడి రెండు తుమ్మెదలను రెండువైపుల బూనెను."

"మంచి భావమండి. తుద కాసంపెంగ పట్టు నెర వేరినది. ఆపద్య మేదండీ?"

నానాసూన వితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపంబంది యో
షా నాసాకృతి దాల్చి సర్వ సుమనస్సౌరభ్య సంవాసియై
పూనెం ప్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్

ప్రేయసీ! నా కావ్యములోని సొగసు నీవు గ్రహించి నట్లే రాయలవారును, ఆయన మిత్రులును గ్రహించి 'ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు' అని నన్ను మెచ్చు కొన్నారు. నేను సామాన్యుడ ననుకొంటివా? నా తండ్రి సింగన పండితకవి. వరాహపురాణాది కావ్యములు రచించిన మలయమారుతకవి మా మేనమామ. మా గురువర్యులు అఘోర శివాచార్యులవారు. ఇంత సంప్రదాయము కల వాడను. పాండిత్యముఁగల కవులుందురు. వారి కవిత్వము పెటుకు గదా! రాయలు, వారిని మెచ్చక నన్ను 'ముద్దు పలుకుల తిమ్మనా' అని గౌరవించినాడు. కలకండ తినిన చిలుకలు బంగరు పంజరములలో తీయతీయగ పలికినట్లు నా కవిత్వము కమ్మగ నున్నదని, పలువురు సెబాసనిరి. రాయలు నాకు నాలుగువేల వరాలొసగినాడు."

"అటులయినచో రాయలవారి యాస్థాన మొక బంగరు పంజరము. మీరు వన్నెల చిలుక. రాయలవారు మిమ్ములను ప్రోత్సహించి మీకు కలకండ పెట్టి కవిత్వము జెప్పించు చున్నారు. మీకు గౌరవము లభించిన నాకుమాత్రము గౌరవము కాదండీ? అన్నట్టు, మీరు కృష్ణరాయలుంగారి మీద కావ్యమల్లినారటే! మాట మాత్రము చెప్పరైరి" అని మణికర్ణిక చిరునగవుతో తిమ్మన కవీంద్రు నడిగెను.

"మణీ! కావ్య మల్లినాను. నీకు దెలియదు కాని కృష్ణరాయలవారు పెద్దన్నను జూచినట్లే నన్ను ప్రేమతో జూచెదరు."

"కారణము మీ కవిత్వమేనా? లేక..."

"సందేహ మేల? 'పారిజాతాపహరణ' మను కావ్యము ముద్దుముద్దుగా తీయని తెనుగు భాషలో రచించి తిని. రేపే రాజసభ జరుగును. నేను రాయలకు 'పారిజాతాపహరణము'ను గృతినిత్తును. ఒకసారి నా పద్యములు రాయలకు వినిపించితిని."

"మీ కావ్యములో విషయ మేమిటండి?"

"ప్రేయసీ! కృష్ణుడు నారదుడిచ్చిన పారిజాతమును స్వీకరించి రుక్మిణి కిచ్చెను. ఒక చెలికత్తె సత్యభామ కడ కేగి పారిజాత వృత్తాంతమును జెప్పెను. రుక్మిణి పారిజాత

మును ధరించుటచే సత్యభామకు గోపము తాండవించెను. ఆమె చీకటింటిలో జలదాంత చంద్రరేఖవలె చేరినది. మాసిన చీరె కట్టినది. ఆమె మానముతో భూషణములు తీసి వేసినది. తలను వాసెనకట్టు కట్టినది. కోపగృహములో సత్యాదేవి ముసుగుపెట్టుకొని పరుండగా కృష్ణుడు సమీపించెను. అతడు వీవనతో విసరెను. సత్యభామ కోపము రెచ్చిపోయెను. కృష్ణుడు మంచిమాట లాడెను. మంచి మాటలు బూడిదలో బోసిన పన్నీరయ్యెను. అత డామె కోపమును దీర్పనెంచి మ్రొక్కెను. ఆమె వామపాదముతో జగన్నాథుని కృష్ణుని దన్నెను.

'పాటలగంధి చిత్తమున బాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటఁగామి మృదుపల్లవ కోమల తత్పదద్వయీ
పాటల కాంతి మౌళిమణి పంక్తికి వన్నియపెట్ట నా జగ
న్నాటకసూత్రధారి యదునందనుడర్మిలిమ్రొక్కెమ్రొక్కినన్'

'జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు, లతాంతాయుధుకన్నతండ్రిశిరమచ్చో వామపాదంబునన్
దొలగంద్రోచె లతాంగి యట్లయగు నాథుల్నేరముల్సేయ బే
రలుకం జెందిన యట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే?'

సత్యభామ జగన్నాటక సూత్రధారి యగు కృష్ణుని దన్నగా అతని శరీరము గగురు పొడిచెను. అతడు సత్యభామతో నిట్లనెను.

"నను భవదీయ దాసుని మనంబున నెయ్యపు గిన్కబూని తా
చిన యది నాకు మన్ననమె చెల్వగు నీపద పల్లవంబు, మ
త్తను పులకాగ్ర కంటక వితానము తాకిన నొచ్చునంచు, నే
ననియెద నల్కమానవుగదా యికనైన నరాళ కుంతలా!"

కృష్ణునకు గోపము రాలేదు. సరిగదా అతనికి నవ్వు వచ్చెను. ముండ్లవంటి తన గగురు పొడిచిన వెంట్రుకలు సోకి సత్యభామ పాదము నొచ్చెనని దలచి యామెను గృష్ణుడోదార్చెను. ఆమె కోపము చల్లారలేదు. ఆమె కృష్ణుని గూర్చి నిష్ఠురముగ బలికినది."

"ఏమండీ, కవిగారూ! ఈకథ మీరు వ్రాయుటలో అభిప్రాయమేమి? రాచవారి యింటి తగవులాట కావ్యములో జేర్తురా? ఎవరైన గ్రహించిన మన పని నగుబాట్లగును" అని మణికర్ణిక నవ్వెను.

"కృష్ణరాయలుంగారికిని, పట్టపుదేవేరి యగు తిరుమల దేవికిని జగడము సంభవించెనట."

"అది మీ కెట్లు తెలిసినది? 'రవి గాననిచో కవి గాంచు' నని సామెత కలదు. అంతఃపురమందలి రహస్యము నాధారముగ జేసి కావ్య మల్లితిరే! ఎంతటి ప్రజ్ఞావంతులు మీరు! మీరిట్లు కావ్యము వ్రాయుటచే రాయలుంగారికి కోపము వచ్చునేమో?"

"ప్రేయసీ! రాయలవారికి కోపము లేదు. నా కావ్యములో రాయలవారు కృష్ణుడైనారు. ఆయన దేవేరి తిరు

మలదేవిని నా కావ్యమున సత్యభామగా చిత్రించితిని. కృష్ణునితో సత్యభామ పలికిన పలుకులు రాయలవారు మెచ్చినారు సుమీ!

"ఇంకిటు నిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకముగాని యీవలని బొంకులు మాచవి గావు రుక్మిణీ.
పంకజ పత్ర నేత్రకును ప్రాణపదంబులు గాన వల్లవీ
కింకర చాలుజాలు నడకింపకు నింపకు లేని కూరుముల్."

"ప్రేయసీ! రాయలు నన్ను మెచ్చి 'కవీంద్రా! నీవు లోకములోని స్త్రీల స్వభావము పారిజాతాప హరణములో జూపినావు' అని నా భుజము తట్టినారు."

"నాథా! సత్యభామ కృష్ణుని వలనను, సవతియగు రుక్మిణీదేవి వలనను పరాభవమును బొంది కంట తడిపెట్ట లేదా?"

"ప్రేయసీ! స్త్రీలు కంట తడిపెట్టి తమ పంతము తీర్చుకొందురు. నా కావ్యములో సత్యభామ యేడ్చినది. నీకన్న ముద్దుముద్దుగా యేడ్చినది. చక్కనిది యేడ్చినను, మాసిన చీర కట్టినను, నగలు పెట్టుకొన కున్నను సొగసుగా నుండును సుమీ!"

"పోనీలెండు. నే నందగత్తెను కాను," మణికర్ణిక లేనికోపమును గనబరచెను.

"కోపమేల? నిన్నన లేదు."

"సత్యభామ యేడ్చిన విధమేమిటండీ?"

"నీ వామెకు శిష్యురాల వయ్యెదవా?"

"ఏమి మాటలండీ?"

"ప్రేయసీ! సత్యభామ లేతమామిడి చిగుళ్ళను మేసిన కోయిలవలె జీరగా యేడ్చినది."

" ఈసునబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబునన్ గాసిలియేడ్చె ప్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ శ్రీ సఖమైన మోముపయి జేల చెరంగిడి, బాలపల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనిన్"

"పద్యమయితే బాగున్నదండి. కవి భార్యనైన నేను లేత మామిడి చిగుళ్లు మేసి గొంతుక జీరవో నేడ్వ మందురా? మీరు నాకు నగలు చేయించనిచో నట్లే చేసె దను." తిమ్మన పకాలున నవ్వెను,

"ప్రేయసీ! నీ మాటలనేర్పు చూపితివి. మరి నేను రాయలుంగారి కడకు బోవలెను. సెలవు."

"నావద్ద సెలవు తీసుకొను చున్నారే? కావ్యము రచించిన బిదప మీ ధోరణి వింతగ మారినది" అని మణి కర్ణిక పలికెను. ముక్కు తిమ్మన రాయల సభకు వెడలెను.

౨

ఆంధ్ర భోజుడని ఖ్యాతిగన్న శ్రీకృష్ణ దేవరాయలు నిండు పేరోలగమున నుండెను. మంత్రి సామంతాది దండ

నాయకులు బారులుతీరి కూర్చుండిరి. ఒకవైపు అల్లసాని పెద్దనామాత్యుడు, తిమ్మనార్యుడు, కుమార ధూర్జటి, మాదయగారి మల్లన, తాళ్ళపాక చిన్నన్న, కర్ణాట కవీంద్రుడగు తిమ్మణ్ణ, సంగీత కళానిధియైన బండారు లక్ష్మీనారాయణుడును సభలో నిండుగా గూర్చుండిరి. మంగళ తూర్య ధ్వనులు చెలరేగెను. మంగళ ధ్వనులలో సామ గానము మేళవించెను. బండారు లక్ష్మీనారాయణుడు సభలో వీణాగానము జేయ సభాస్తారుల హృదయము లానంద ముతో నిండెను. రాజనర్తకి సవిలాసముగ సభలో నాట్య మాడెను.

ముక్కు తిమ్మన "పారిజాతాపహరణ" కావ్య మును రాయుల కొసంగెను. కృష్ణరాయలు తిమ్మనకు మహాగ్రహారములు, మణి కుండలములు బహుమాన మొసగెను. కవీంద్రుడు తళతళలాడు మణికుండలములు ధరింపగా కపోలములు మెరసెను. ఆయన కన్ను లానందముతో మిలమిలలాడెను. పచ్చని దబ్బపండువంటి కవి వక్షముపై యజ్ఞోపవీతముతో దారహారము, ముత్యాల సరులుకూడ వ్రేలాడుచుండెను. అతని భుజముపై కాశ్మీర శాలువ మెరయుచుండెను. ఉత్సవానందము వెలిబుచ్చుచు పెద్దన కవీంద్రుడు చాటు పద్యములు చెప్పెను.

సభానంతరము తిమ్మన కవీంద్రుడు గృహోన్ముఖుడయ్యెను. కవి తన బహుమానములు భార్యకు జూపవలెనని వేగముగ నడచు చుండెను.

తిమ్మనగారికి త్రోవలో భట్రాజు కనబడెను. అతడు తిమ్మన కవితను బొగడెను.

'మా కొలది జానపదులకె
నీ కవితాశివి? యబ్బునే కూప నట
ద్భేకములకు గగనధునీ
శీకరముల చెమ్మ? నంది సింగయ తిమ్మా!'

పద్య మాకర్ణించి తిమ్మన తన చెవి నున్న మణి కుండల మొక్కటి భట్టున కిచ్చెను. పెన్నిధిగన్న పేదవలె భట్రాజు మిగుల సంతోషించి మరలెను.

తిమ్మన గుమ్మములో నడుగు పెట్టెను. మణికర్ణిక మందహాసముతో కవీంద్రున కాహ్వాన మొసగెను.

"ఏమండీ కవిగారూ! కృష్ణ రాయలుంగారు కర్ణ కుండల మొక్కటే యిచ్చినారా?" అని మణికర్ణిక వేళా కోళము జేసెను.

"ప్రేయసీ! రాయలవారు మణికుండలములు రెం డొసగినారు. త్రోవలో భట్రాజు నా కవితకు మురిసి పద్య మును జెప్పెను. మణికుండల మొకటి భట్టున కిచ్చితిని" అని తిమ్మన శివిగ బలికెను,

"మీ రమాయకులు. భట్రాజుకు కుండల మిచ్చె దరా?"

"అతని పద్యము రుచిగా నుండుటంజేసి కుండల మొసగినాను."

"ఏమని చెప్పినాడండి?"

"నా కవితాశీవి తనకు రాదని భట్టు పలికినాడు. తాను కూపస్థ మండూకమట! కూపమందలి మండూకము లకు ఆకాశ గంగానదీ తరంగముల తుంపురులు సోకునా? అనగా నా కవిత గంగానదివలె హాయి గొల్పునని స్తుతించి నాడు."

"రెండవ కుండలము సంపాదింపుడు. జోడు మణి కుండలము లున్నయెడల మీ చెక్కుళులు కాంతిగా నుండును. నేను మీ కపోలములలో ముఖము చూచుకొందును."

"ప్రేయసీ! కవిత్వమును జెప్పుచున్నావు!"

"కవిభార్య నైనందున చెప్పగలను. మీరు భోజ నాదికము ముగించుకొని రాయలుంగారి దర్శనము చేయుడు."

"నీ సలహా బాగున్నది. కృష్ణరాయలుం గారిని రాజమంది రోద్యానమున గలసెదను. వారు పెద్దనార్యు నితో షికారు వెళ్లినపుడు కలసెదను. రెండవ కుండల మును సంపాదింతును. కుండలముల కేమిగాని, రాయలు మనకు మహాగ్రహారములు దాన మొసగినాడు" అని తిమ్మన భార్యతో బలికెను. మణికర్ణికాదేవి నేత్రములానంద తరంగితము లయ్యెను. కవీంద్రుడు తన భుజమున నున్న

కాశ్మీరశాలువ ప్రియురాలిపై గప్పెను. "మణీ! నీవే కవయిత్రివి. నీవలననే కావ్యమల్లితిని. మహాగ్రహారములునీవే!"

"పచ్చడము నాకెందుకు? మడి మాన్యములెందుకు? మీరే నాకు ధనము" అని మణికర్ణిక వగలు పోయెను.

"పోనిమ్ము. నీకు మణికుండలము లిత్తునా?"

"అవి బరువుగా నుండును. నా లేత చెవులు భారము మోయజాలవు."

"నీ పేరే మణికర్ణిక. కుండలములు నీ కేల?"

"మీ మాటలతో నా కడుపు నిండినది."

"అటులనా?"

"బాగుగ నున్నది. మీరు లేచి మడి గట్టుకొనండి. మీ దేవతార్చన యగుసరికి కప్పురభోగి వంటకము సిద్ధమగును. రాజ సన్మానము పొందినారు కనుక నా సన్మానము గూడ మీరు పొందక తప్పదు. కమ్మని యావునేతితో రకరకముల బిండివంటలు చేసితిని. చక్కెర కేళీ యనటిపండ్లతో మీ ముఖము మొత్తును."

"నీ పలుకులు తీయనివి. నీ చేయి చల్లనిది" అనుచు తిమ్మన దేవతార్చనకై లేచెను.

దేవపూజాదిక మయినపిమ్మట తిమ్మన షడ్రసోపేతముగ భుజించెను. అతడు తూగుటుయ్యెలలో బరుండెను. కొంతవడికి దివాణములో ఠంగు ఠంగున గంటలు కొట్టిరి. ఆయనకు మెలకువ వచ్చెను. మణికర్ణిక పూదేనియలో

యనటిపండ్లు కలిపి భర్త కొసగెను. అతఁడు ఫలరసము గ్రోలి, లేడిమలపాకు మడుపులు నమలెను. తిమ్మన కాశ్మీర శాలువ కప్పుకొని, ఒంటి కుండలము చెవినున్నను లెక్క సేయక రాజ దర్శనార్థము బయలు దేరెను.

సంజవేళ తుంగభద్రానదీ వాయువులు వీవఁదొడగెను. కృష్ణరాయ లుద్యానవనములో మిత్రులతో దిగ్విజయ యాత్రా విశేషములు వర్ణించుచుండెను. కుమార ధూర్జటి "కృష్ణరాయ విజయములో" కొన్ని ఘట్టములు పఠించెను. తిమ్మకవి రాజమందిరోద్యానము ప్రవేశింపగనే రాయల మిత్రులు చమత్కారముగ మాటలాడిరి. రాయల యానతిపై చెలిమికత్తె మణికుండలమును దెచ్చి తిమ్మన కవీంద్రుని చెవికి బెట్టెను. రాయలు 'ముద్దుపలుకుల తిమ్మనా, ముక్కు తిమ్మనా!' యని నవ్వుచూ కవిని గౌరవించెను.



## శ్రీ కృష్ణదేవరాయలు

"తెలుగ దేల యన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ దెలుగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశభాషలందు దెలుగు లెస్స" యని యాంధ్ర భోజుడని ప్రఖ్యాతి గన్న శ్రీకృష్ణదేవరాయలు మాతృభాషా

ప్రాశస్త్యమును స్తుతించెను. శ్రీకృష్ణదేవరాయలు వీర నరసింహరాయల యనంతరము క్రీ. శ. 1509 సంవత్సరమున సింహాసన మధిష్ఠించెను. రాయలు తుంగభద్రానదీ తీర మున గల విజయనగర సామ్రాజ్యమును బాలించెను.

విజయనగరమున కుత్తరమున బీజపురసుల్తానులు, కళింగరాజ్యమును పాలించు గజపతులును విజయనగర మాక్రమింపవలె నని ప్రబల యత్నములు చేయుచుండిరి. రాయలు రాజ్యమును గట్టుదిట్ట మొనర్చుటకు బూనుకొని సేనను బలపరచి దిగ్విజయ యాత్రకు వెడలెను.

అతఁడు దక్షిణ దిగ్విజయ యాత్రకు బయలువెడలి మహిసూరులోని యుమ్మటూరు, శివసముద్రము, శ్రీరంగపట్ట ణమును లోబఱచుకొనగా మహిసూరుదేశము స్వాధీన మయ్యెను. రాయలు నెల్లూరు మండలములోని యుద యాద్రిపై దండెత్తి దాని కధికారిగానున్న ప్రహరేశ్వర పాత్రుని జయించి యా దుర్గము వశపరచుకొనెను. కృష్ణ రాయలు కనిగిరిపై దండెత్తి వీరరుద్రుని రాజ్యమును, అతని కుమార్తెయగు చిన్నాదేవిని స్వీకరించి, ద్రోహియైన యాతని జంపక వింధ్యపర్వతములకు బారద్రోలెను. వీరరుద్రుని స్త్రీలు వింధ్య పర్వతములపాలైనటుల పెద్దనకవి మనుచరిత్రములో నుడివెను.

"ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీగతి న్వింధ్య గ హ్వరము ల్దూఱగజూచి తారచట గాపై యుండుటం జాల న

చ్చెరువై యెఱ్ఱని వింత చీకటులు వచ్చెం జూడ రేయంచు వే
సారిదిం జూచెరు వీరరుద్ర గజరాట్ప్రుద్ధాంత ముగ్ధాంగనల్."

రాయలు పూర్వదిగ్విజయ యాత్రలో కొండవీడు, వినుకొండ, విజయవాడ, కొండపల్లి, రాజమహేంద్రవరమును స్వాధీనము గావించుకొనెను. అతడు పొట్నూరివద్ద విజయ స్తంభము వేయించెను. రాయలు వడ్డాది జయించి, ఉత్కలములోని కటకపురమును స్వాధీనము చేసికొనెను. ఉత్కలేంద్రుడగు ప్రతాపరుద్రదేవుడు తనకుమారిని తిరుమలదేవిని రాజునకిచ్చి వివాహము చేసెను. అందువలన రాయలు సంధిప్రకారము కళింగరాజ్యమును మరల ప్రతాపరుద్ర భూపతి కిచ్చెను.

తిరుమలదేవియు, చిన్నాదేవియు నిద్దరు భార్యలు కృష్ణరాయలకు గలరు. రాయలు పూర్వదిగ్విజయయాత్రలో సింహాచలము దర్శించినపుడు భార్యలచే నరసింహస్వామికి ధర్మము చేయించెను.

కృష్ణరాయలు కవితాపోషణమే కాక శిల్పాదికళలను వృద్ధిచేసెను. ఆయన అనేక మందిరములను, దేవాలయములను నిర్మించెను. విజయనగరములోని విరూపాక్ష దేవాలయమునకు గోపురము కట్టించెను. రాయ లుదయాద్రి దుర్గమును ముట్టడించిన తరువాత నొక కృష్ణవిగ్రహమును దెచ్చి విద్యానగరమున కృష్ణాలయమున ప్రతిష్ఠించెను. విఠలస్వామి దేవళము, హజార రామస్వామి మందిరమును

కృష్ణదేవరాయలే నిర్మించెను. దక్షిణ హిందూదేశమం దనేకచోట్ల రాయలు దేవాలయములను, గోపురప్రాకార ములను కట్టించెను. కృష్ణరాయలు కాళహస్తి కేగి, కాళ హస్తీశ్వరుని సన్నిధానములో సహస్రస్తంభ మంటపమును, ఉన్నత గోపురమును నిర్మించెను.

రాయలు మిగుల భక్తిపరుడు కనుకనే దేవాలయ శిల్పమును బోషించెను. శిల్పాది లలితకళలు వృద్ధిజెందు టకు భక్తియే కారణము. హృదయములో భక్త్యావేశము లేనివాడు శిల్పమును బోషింపలేడు, సృజింపలేడు. కృష్ణ రాయలు మహాసామ్రాజ్యాధిపతియై లలితకళాపోషకుడై కవులపాలిట కల్పవృక్షమై చిరకీర్తి గాంచెను.

భోజరాజు సంస్కృతము నాదరించినట్లే కృష్ణరాయ లాంధ్రభాషను బోషించెను. ఆయన కవులను అష్టదిగ్గజము లనువారిని సన్మానించి కావ్యరచన చేయించెను. రాయల యాస్థానము నలంకరించిన మనుచరిత్రకారుడైన అల్లసాని పెద్దన, పారిజాతాపహరణ కృతికర్తయగు నందితిమ్మన, రామాభ్యుదయ ప్రబంధ రచయిత యగు అయ్యలరాజు రామభద్రుడు, కృష్ణరాయవిజయ ప్రబంధ నిర్మాతయగు ధూర్జటి, ప్రభావతీప్రద్యుమ్న కర్తయగు పింగళి సూర నార్యుడు, రాజశేఖరచరిత్రకర్తయగు మాదయగారి మల్లన, వసుచరిత్రకావ్యము రచించిన రామరాజభూషణుడు, పాండు రంగమాహాత్మ్య ప్రబంధ రచయిత యగు తెనాలి రామ కృష్ణుడను యెనమండ్రును అష్టదిగ్గజములని వాడుక గలదు.

పూర్వ దిగ్విజయయాత్ర ముగిసిన తరువాత యుద్ధము లేమియు లేకుండుటచేసి కవితా వ్యాసంగమునందు కృష్ణ రాయలు ప్రొద్దుపుచ్చుచుండెను. అల్లసాని పెద్దనార్యుడు మనుచరిత్ర ప్రబంధము రచించి రాయలకు కృతియొసగెను. నందితిమ్మన పారిజాతాపహరణ మను కావ్యమును రాయల కంకితమిచ్చెను. రాయలు మదగజముపై నెక్కి రాజధానిలో సంచారము చేయునపుడు పెద్దనార్యు డెదురైనచో మదగజ మును నిలిపెడివాడు. రాయలు పెద్దనకు కేలూతనిచ్చి మద కరీంద్రముపై నెక్కించుకొనెడివాడు. మనుచరిత్రకావ్య మును కృతిగా స్వీకరించినపుడు రాయలు పెద్దనకు అగ్రహా రములు దానముచేసెను. పెద్దన కూరుచున్న పాలకిని ప్రభువు స్వయముగా కేలబట్టి యెత్తెను. కవీంద్రుని పాద ములకు మహారాజు గండపెండెరము తొడిగెను.

నిరంతర కవితా వ్యాసంగముచే రాయలు సైతము తెలుగుభాషలో కావ్యములు రచించెను. రాయలు మదాలస చరిత్ర, సత్యావధూప్రీణనము, సకల కథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, విష్ణుచిత్తీయ మను కావ్యములు వ్రాసెను.

రాయల ఘనతను గురించి కవులు చాటుపద్యము లనేకములు రచించినారు. తెనాలి రామకృష్ణుడు సభలో నీపద్యము నాశువుగ జెప్పెను.

'కాయమువంగి తాముదిసె గన్నులుఁ బొరగప్పె గాలు పె
ద్దాయెనటంచు రోసి నవసాధిపనందన కృష్ణరాయ యీ

భూయువతీలలామ నినుబొందిన నాదిభుజంగభర్తకున్
బాయని చింతచేత దలప్రాణము తోకకు రాకయుండునే'
రామరాజభూషణుడు కృష్ణరాయలను గురించి పద్యమిట్లు
చెప్పెను.

'శ్రీలీలాత్మజ కృష్ణరాయ సమరోర్వి న్నీదు వైరిక్షమా
పాలు ర్వేగి హయాధిరూఢులగుచుం బాఱన్ వనీశాఖశా
ఖాలగ్నాయత కేశపాశులయి యూగన్ గేకిసల్కొట్టి యు
య్యాలోజంపములంచు బాడుదురు భిల్లాంభోజపత్రేక్షణల్'

శ్రీకృష్ణదేవరాయలు దిగ్విజయ యాత్రా సందర్భ
మున విజయవాటికయందు కొన్ని దినములుండి శ్రీకాకుళ
మందలి యాంధ్రవిష్ణుదేవుని సేవించుట కేగెను. రాయల
కాదేవుడు స్వప్నములోతోచి వేంకటేశ్వరుని కంకితముగా
దెలుగుకావ్యము జేయుమనెను. రాయలు వైష్ణవభక్తి
పారవశ్యముచే "విష్ణుచిత్తీయము" లేక "ఆముక్త
మాల్యద" యను పేర దివ్యప్రబంధము నిర్మించెను.
రాయల భక్తియే ఆముక్తమాల్యదగా బరిణమించెను.

శ్రీవిల్లిపుత్తూరను గ్రామమున విష్ణుచిత్తుడను భక్తా
గ్రణియుండెను. అతడు నిత్యము పెరుమాళ్ళను సేవించు
చుండెను. ఆభక్తుడు విష్ణాలయమునకేగి తదీయ మందిర
ప్రాంగణమును సమ్మార్జన చేసెడివాడు. స్వామి తిరునాళ్ళు
వచ్చినపుడు విష్ణుచిత్తుడు సంతోషితస్వాంతుడై పల్లకి
మోయువాడు. దేవళమునకు సమీపముననున్న పుష్పో

ద్యానములో విష్ణుచిత్తుడు పూవులు కోసిదెచ్చి మాలలుకట్టి స్వామికి సమర్పించెడివాడు. దేవదేవుని యుత్సవసమయ మందు హారతులు వెలిగించుటయో, ఆతపత్రము బట్టుటయో చేసెడివాడు. తోటపనితో నతని చేతులు కాయలు కాసినవి. కాని అతని మనసు విష్ణుమూర్తియందే లగ్నమై కోమలమై యుండెను. భగవంతునిసేవ జేయుటయందు భక్తులు సంతోష మనుభవింతురు.

'గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్ర ధృతియో, ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్'

విష్ణుచిత్తునకు దేవమందిరోద్యానమున నొక బాలిక లభించెను. పిల్లలు లేకుండుటజేసి యాతడు బాలికను అల్లారు ముద్దుగ బెంచి పెద్దచేసెను. ఆమెకు గోదాదేవి యనునామముంచెను.

ఆకన్య చిదిపి దీపముపెట్టి నటుండెను. విష్ణుచిత్తునితో నామె తోటలోనికేగి పూవులు కోసిదెచ్చి మాలలు కట్టసాగెను. ఆకన్య మనసంతయు మానవులపై బోక శ్రీరంగనాథునిపై మరలెను. ఆమె రంగనాథుని పటమునకు మాలలువైచి యుప్పొంగెడిది. శ్రీరంగదేవుని స్మరించినంతనే ఆమెకన్నులు చెమ్మగిలసాగెను. తనువు పులకరించెను. ఆమె రంగనాథునిపై గీతములు రచించి యాలాపించుచు సంతోషమున శరీరము మరచుచుండెను.

ఒకనాడు పెంపుడు తండ్రియగు విష్ణుచిత్తుడు కన్య మనసు పరీక్షింపదలచి "అమ్మా! నీకు పెండ్లియీడువచ్చినది. పెండ్లిచేయ దలచినాను" అని పలికెను.

"తండ్రీ! నేను రంగనాథుని దక్క అన్యుని జేపట్టను. నేను రంగేశుని భార్యను. నామనసు దేవదేవునిపై నిలిచినది. మరల్పజాలను" అని కన్య తలవాల్చి చిరునగవు మొగమునం దుట్టిపడగా బలికెను.

విష్ణుచిత్తుని మానసము పొంగిపోయెను. దినదినము గోదాదేవి మందిరోద్యానమున కేగి పూవులు గోయసాగెను. ఆతోటలో చెంగలువలున్న సరస్సుదరికి ద్రావిడాంగనలు వచ్చి యామె చక్కదనమునుజూచి యాశ్చర్యపడిరి.

గోదాదేవి పువ్వులమొత్తమును మాలగాజేసి చెంగలువ సరసికడ కూరుచుండి రంగనాథుని దలచెను. ఆమె మనసులో మధురభావము లుప్పతిల్లెను. "నారంగేశునకు నే నందాలరాశినై గోచరింతునా! నేనాతని హృదయమును జూరగొనగల్గుదునా? నా కేశపాశమునకు జుట్టకొన్న పుష్పముల అందములు చిలుకునోలేదా?" అని గోదాదేవి సరసీజలమున తన కేశాలంకరణ ప్రతిబింబమును గాంచి మురిసెను.

"నామనోనాథునకు నాతలలో తురుముకొన్నపూవుల దండనే కానుకగా యొసంగెదను. నేను రంగనాథుని ప్రియురాలను కనుక అతడు మాలను స్వీకరింపకుండునా?"

ఫలములు రుచ్యములైనవో కావో తాను రుచి చూచి శబరి శ్రీరామచంద్రునకు సమర్పించెను. భక్త వశంవదుడు శ్రీరాముడు ప్రీతిపూర్వకముగ శబరీదత్త ఫలములను స్వీకరించి సంతసించెను. అటులనే గోదాదేవి తలలో తురుముకొన్న పూవులదండను శ్రీరంగమందలి రంగనాథస్వామి కర్పించెను. ఆమె పేరు 'ఆముక్తమాల్యద' అని సార్థకమయ్యెను. రంగనాథుడు గోదాదేవిని వివాహ మాడెను. "ఆముక్తమాల్యద" కృష్ణరాయల మూర్తీభవించిన భక్తిభావము.

---

## అల్లసాని పెద్దన

నా కీ వార్థకమున కృష్ణరాయలతోడి వియోగము సంభవించినది. కవితాపోషణకు ప్రభుసమాదరణము లేదయ్యెను. రాయలుంగారు, కవులపాలిటి కల్పతరువై దేశభాషలలో తెలుగుభాషకు గౌరవము జేకూర్చిన రాజేంద్రుడు, తిరిగి రారుకదా! కవు లందరికన్న రాయలవారికి నాపై గల యభిమాన మపరిమితము. నాకవిత్వమునకు రాజేంద్రుడు మురిసి సౌహార్ద్రిముజూపి సార్వభౌముడన్న విషయముగూడ మరచెడివాడు. రాయలు మదకరీంద్రముపై నెక్కి విజయనగర రాజవీథుల సంచారము గావించునపుడు నే నెదురైనచో మదగజమును నిలిపి నన్ను హస్తిపై నెక్కించుకొనెడివాడు.

'ఎదురైనచో దన మదకరీంద్రము డిగ్గి
        కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళ బుర మేగ
        బల్లకి తన కేల బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండరమున కీవె
        తగుదని తానె పాదమున దొడిగె
గోకటగ్రామా ద్యనేకాగ్రహారము
        లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దన కవీంద్రయని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు.'

రాయలను దలంచినపుడెల్ల నా నిండుపేరోలగమును మరువజాలను. కృష్ణరాయలు నన్నొకనాడు కృతిచెప్పుమని వేడిన నేను వల్లెయని ఈ పద్యము చెప్పితిని :

'నిరుపహతిస్థలంబు, రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మకింపయినభోజన, ముయ్యెలమంచ, మొప్పుత
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినగాక యూరక కృతుల్రచియింపు మటన్న శక్య మే?'

నా పద్యమునకు మెచ్చి రాయలు నన్ను బహూకరించెను. ఆస్థానములో రాయలు స్వయముగా నా కాలికి బిరుదందె వేసినాడు. ఆనాడు నా హృదయముప్పొంగిపోయెను. సరస్వతీ

దేవి కాలి యందెల ఘల్లులలు పేరోలగమున నిండినటు లుండెను. సంస్కృతాంధ్ర భాషలలో సుకవిత్వము జెప్ప గల వారెవ్వరని రాయలవారు ప్రశ్నింప నేను సాహసించి లేచితిని. నే నాశువుగ జెప్పిన పద్యమాలికకే గండపెండ రము లభించినది. విజయనగర సామ్రాజ్య కవితాసరస్వతీ వైభవము గండపెండరమును గాంచినపుడెల్ల నాకు దోచు చుండును. కవితాసరస్వతి నామనసులో దాండవించెను.

'శీతనగాత్మజా గిరిశ శేఖర శీతమయూఖ రేఖ కా
పాతసుధాప్రపూరబహుభంగ ఘుమంఘుమఘుం ఘుమాంచ్ఛటీ
జాతక తాళయుగ్మ నయసంగతి చుంచువిపంచికా మృదం
గాతత తేహి తత్తహిత హాధిత ధంధణు ధాణు దింధిమి
వ్రాత సమానుకూల పదవార కుహూద్వహహారి కింకిణీ
నూతన ఘల్లు లాచరణ నూపుర ఝుళిఝుళీ మరంద సం
ఘాత వియద్ధునీ చకచక ద్విక చోత్పల సారసంగ్రహా
యాత కుమార గంధవహ హారిసుగంధ విలాసయుక్తమై
చేతము చల్లజేయవలె జిల్లన జల్లవలె స్మనోహర
ద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయస ప్రసా
రాతి రసప్రసార రుచిరప్రతిమంబుగ సారెసారెకున్,'

"కృతి రచింపుము మాకు శిరీష కుసుమ పేశల సుధామయో క్తుల బెద్దనార్య" యన్న రాయలమాట పదేపదే స్మరణకు వచ్చుచుండును. రాయల ప్రోద్బలముచే హరికథాసారమును గూడ రచింపగలిగితిని. నాకు రాయలొసంగిన కోకట

గ్రామము రాయల యౌదార్యమునకు శాశ్వత సాక్ష్యము గదా!

౨

'కలనాటి ధనము లక్కఱ
గలనాటికి దాచ గమలగర్భుని వశమా
నెలనడిమినాటి వెన్నెల
యలవడునే గాదె బోయ నమవస నిశికిన్.'

అని నేను రచించిన పద్యములో 'యమవసనిశి' యన్నందులకు తెనాలి రామకృష్ణకవి,

'ఎమితిని సెసితివి కపితము
బ్రమువడి వెఱిపుచ్చకాయ వడిదని సెపితో
యుమెతక్కాయ దివి సెపితో
యమవసనిశి యన్నమాట యలసని పెదనా.'

యని నన్నాక్షేపించినాడు. రామకృష్ణు డేమన్నను హాస్యమున కన్నమాటలే? 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' యని నా కవితారీతినిగూర్చి పలువురు మెచ్చుకొనుచున్నారు. నా మనుచరిత్ర ప్రబంధములో హిమశైల వర్ణనములో పదములకూర్పునకు మెచ్చనివా రుందురా?

''అటజనిగాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరిఝ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన

స్ఫుట నటనానురూప పరిఫుల్ల కలాపకలాపిజాలమున్
గటకచరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్."

సంధ్యాకాలవర్ణనము సొగసుగ నిట్లు చేసితిని :

"శ్రేణులుగట్టి నభోంతరాళమున బాఱెం బక్షులుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృష్ణావార్ధులింకెన్ జపా
శోణంబయ్యె బతంగబింబము దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబులయ్యెన్ గడున్"

నేను పదునాఱవ శతాబ్దమున మనుచరిత్ర రచించినను మీరు నా కవిత్వమును ఆస్వాదించుచునే యున్నారు. భావి కాలమునకూడ రసజ్ఞులు నా కవిత్వములోని యల్లికసొంపు గ్రహింప గలుగుదురు.

# తెనాలి రామకృష్ణుడు

తెలుగునాట తెనాలి రామకృష్ణుడు తన చిత్రవిచిత్ర జీవిత గాథలచే మన కడుపులు చెక్కలగునటుల నవ్వించినాడు. రామకృష్ణకవి తెనాలి యను నగ్రహారమున లక్ష్మాంబా రామయ్యలకు జన్మించినాడు. అతడు సరస కవిత్వము జెప్పి చతురోక్తులతోను జాటువులతోను, బలువుర హృదయములు చూరగొనినాడు.

పెక్కుమంది కవులకు నమ్రభావముండును. వారు తమ కీర్తిని చాటి చెప్పుకొనరు. రామకృష్ణకవి మేటియైన ఆత్మశ్లాఘాప్రియుడని యాతని కవిత్వమువలన మనకు దెలియుచున్నది. అతడు పాండురంగ మాహాత్మ్యమును వైష్ణవ భక్తి ప్రతిపాదకమగు మహాప్రబంధము రచించు సందర్భమున తన్నుదాను స్తవమొనర్చుకొనెను. విదూరి వేదాద్రి యను ప్రభువు రామకృష్ణుని బ్రశంసించెనట.

'ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టిరా
విదితంబైన మహిన్మహాంధ్ర కవితా విద్యాబలప్రౌఢి నీ
కెదురేరీ సరసార్థ బోధ ఘటనా హేలాపరిష్కార శా
రద నీరూపము రామకృష్ణ కవిచంద్రా సాంద్రకీర్తీశ్వరా!'

చిన్నతనములో రామకృష్ణుడు భట్రాజులతో సాంగత్యము జేసి చాటువులను చమత్కారముగ రచింపనేర్చెను. అతడువికటకవియని విఖ్యాతి సంపాదించినాడు. రామకృష్ణకవికి రాజాస్థానము మొట్టమొదట లభింపనందున రాజపురుషుల నాశ్రయించి రాజాదరణము సంపాదింప నెంచెను. అతడు కేవలము సాధువు కాడు. హాస్యప్రియుడు. పరులను బరిహసించి చమత్కారములు చేయుటవలన బలుమారు రాజులకు అతనిపై గోపము వచ్చెడిది. అతనిని గురించిన వింతకథ యొకటి కలదు.

రామకృష్ణుడు రాజగురువైన తాతాచార్యుల వారి విషయమున అపచారముచేసెను. రాజాజ్ఞను శిరసావహించి

రాజసేవకులు తెనాలి రామకృష్ణుని దలవరకు భూమిలో బాతిపెట్టించిరి. రాజభటులు రామకృష్ణుని త్రొక్కించుటకు మదగజమును దెచ్చుటకై వెడలిరి. ఇంతలో గూని చాకలి యొకడు మార్గమున బోవుచు రామకృష్ణుని గాంచి యిది యేమని యడిగెను. రామకృష్ణుడు "చాకలీ! నాగూను పోగొట్టుకొనుటకై వైద్యుని సలహా ననుసరించి చికిత్సను బొందు చున్నాను. నాగూను పోయినదో లేదో నన్ను బైకితీయు"మనెను. అతనికి గూనులేకుండుటం జేసి చాకలి యాశ్చర్యపడి తన కాచికిత్స గావింపుమని కవిని గోరెను. రామకృష్ణుడు చాకలిని తలవఱకు భూమిలో పాతి తాను వెడలిపోయెను.

అనంతరము రాజభటులు గజమును దెచ్చి చూతురు గదా రామకృష్ణుడు లేడు! రాజసేవకులు జరిగినదంతయు రాజుగారికి విన్నవించిరి. రామకృష్ణుడు రాజసభకు జని పరమేశ్వరానుగ్రహమున తిరిగి బ్రతికితి నని రాజుకు నమ్మకము పుట్టునట్లు చెప్పెను. నూఱు తప్పులు సైరించునట్లు రాజువలన వరమును బొందెను.

రామకృష్ణకవిని గూర్చి మరియొక వింతకథ చెప్పుదురు అతడు నందితిమ్మనను వేళాకోళము చేసెనట. తిమ్మనకు రాకరాక కోపము వచ్చెను. కోపాటోపముతో దిమ్మన రామకృష్ణుని బండ్లూడ దన్నెను. రామకృష్ణకవి దుప్పికొమ్ముతో నూడినపం డ్లమర్చుకొని రాజసభ కేతెంచెను.

సభలోనున్న రామరాజభూషణ కవి యీసంగతి కనిపెట్టి నాడు. కృష్ణరాయలు 'రవిగాననిచో గవి గాంచునే కదా' యని సమస్య నిచ్చెను. రామరాజ భూషణుడు వెంటనే లేచి సమస్య నీతీరున బూరించెను :

'ఆరవి వీరభద్రుని పదాహతిడుల్లిన బోసి నోటికిౕ
నేరడు, రామకృష్ణకవి నేరిచెబో మన ముక్కుతిమ్మరాట్
క్రూర పదాహతిం బడిన కొక్కిరి పంటికి దుప్పికొమ్ము ప
ల్గా రచియింప నేర! రవిగానని చో గవి గాంచునే కదా!'

ఇటు లవమానించుటచే రామకృష్ణునకు బట్టరాని కోపము వచ్చెను. అతడు రామరాజభూషణుని కవిత్వమును వేళాకోళము చేయుచు చాటుపద్యమును రచించెను.

ఒకసారి రాయలవారి దర్శనార్థ మొక పండితుడు వచ్చినపుడు రామకృష్ణుడు :

'తృవ్వట బాబా, తలపై
పువ్వట జాబిల్లి, వల్వబూడట, చేదే
బువ్వట, చూడగను హుళ
క్కవ్వట, యరయంగ నట్టి హరునకు జేజే'

అను పద్యమును చెప్పి తాటియాకుమీద వ్రాయమనెను. తృవ్వ, హుళక్కి అను పదములను వికృతముగా నుచ్చరించుటచే పండితుడు వ్రాయజాలక వెడలిపోయెను.

౨

రామకృష్ణుని గాథ లెన్నేని యున్నవి. రామకృష్ణకవి సంస్కృతాంధ్రభాషలలో వైదుష్యమును, కవితాశక్తిని సంపాదించి ప్రబంధకవీశ్వరు డని వన్నె కెక్కినాడు. 'పాండురంగవిభుని పదగుంభనంబును' అన్నట్లు రామకృష్ణుని పదముల కూర్పు, సొగసు జెప్పదరము కాదు. పాండురంగ మాహాత్మ్యములో దెనుగు నుడికారపు సొగసుందనము మనల నాకర్షించి తీరును.

రామకృష్ణుని ప్రబంధములో నిగమశర్మోపాఖ్యానము కవితా చమత్కృతితో నీతిదాయకమై విలసిల్లు చుండును.

నిగమశర్మ కథ

కళింగదేశమున కాభరణమైన పీఠికాపురమున నిగమశర్మ యను విప్రకుమారు డుండెను. అతడు పుట్టినయిల్లు వేదములు వోసినగాదె. అతని తండ్రి వైదికాచార సంపన్నుడు, సోమయాజి. అతని తల్లి సోమిదమ్మ. నిగమశర్మ పెరిగి పెద్దవాడై నూనూగు మీసాల నూత్నయావనమున జూపరుల కన్నులు చెదరున ట్లుండెను.

నిగమశర్మ తలంటుకొని శుచియై తెల్లని వలిపెములు దాల్చి షడ్రసోపేతముగ భోజనము గావించును. మధ్యాహ్న వేళ శర్మ మంచిగంధము పైపూత గావించుకొని, కపురంపు

వీడ్యము నమలుచు, పూవులదండలు భూషణపంక్తులతో ధరించి, పులుకడిగిన ముత్యమువలె నుండును. సఖులు, పరిహాసకులును వెంటరాగ నిగమశర్మ వీట విహరించుచుండును. అతడు దుర్వ్యసనముల గడిదేఱినాడు. తరతరముల నుండి తాత ముత్తాతలు చీమవలె గూడబెట్టిన విత్తము శర్మ వెచ్చించెను.

దిన వెచ్చమునకున్నై నిగమశర్మ తన మేనగల సొమ్ము షాహుకారింటిలో గుదువ బెట్టెను. తల్లి మెడలోని బంగారమును శర్మ కడతేర్చెను. అతడు తన యిచ్చవచ్చినట్లు కోమట్లవద్ద నప్పు సొప్పుల చేసెను. అతడిచ్చా విహారము సలుప సమకట్టెను. అతడింటికి వచ్చుటయే మాని, కల్లలాడి కడుపు నింపుకొన సాగెను. తొల్లిటి వైభవమంతయు గతించెను. ఋణదాతలు శర్మను వెతపెట్టగ పీఠికా పురమున దలెత్తుకొని దిరుగ లేకుండెను. అతడు పూవులు ముడిచిన యంగళ్లనె కట్టెలు మోయవలసి వచ్చెను.

ఒకనాడు దుశ్శీలుడైన నిగమశర్మను శిక్షించెదనని అక్కగారు వానిని మాతృభవనమునకు దీసికొని వచ్చెను ఇట్లు పంచయోజనమాత్ర దూరమున నున్న తన యూర నుండి వచ్చి పితృభవనమును జొచ్చి యచ్చట గొన్ని ప్రొద్దులు గడపెను. నిగమశర్మ కన్నెత్తి భార్యవైపు చూచువాడు కాడు. అక్కగారు మరదలి గతికి వగచి కన్నీరు కార్చెను. నిగమశర్మ రేయెల్ల దిరిగి, ఉదయమున నింటికి

జలిదియన్నము గుడుచుటకు వచ్చెను. "తమ్ముడా! నీరాక పోకలు బాగుగా లేవు. త్వరలో సీమంతపు బెండ్లికొడుకవు గావలెను" అని యాశీర్వదించెను. శర్మ వెడలిపోవ దల చెను. "తమ్ముడూ! వెడలిపోకుము. నీ మేనల్లుని మెత్తు కొనుము. ఎచ్చటి కేగెదవు? మీ బావబంతి నారగింతువు గాక. శాకపాకములు నిమిషములోన గావింతును" అని యామె హితమును బలికెను.

తమ్మునిపై గల మమకారముచే నక్కగా రాతనికి దలంటెను. మల్లెపూవులవంటి శుభ్రవస్త్రము లాతనికి గట్ట బెట్టెను. శర్మ తన కిష్టములైన వంటకములు భుజించి, సంతుష్టుడై తాంబూలము వేసుకొని నవ్వుచు గూరుచుండెను. అక్కగారు సోదరునకు హితము సెప్పబూనెను. "తమ్ముడా! వేదాభ్యాసము కట్టిపెట్టితివి.

"ప్రారంభించిన వేదపాఠమునకున్ బ్రత్యూహమానంచునో
యేరా తమ్ముడ నన్నుజూడ జనుదే వెన్నాళ్ళనోయుండి చ
క్షూరాజీవయుగంబు వాచె నినుగన్గోకున్కి మీ బావయున్
నీరాకల్ మదిగోరు చంద్రుపాడుపున్ నీరాకరంబున్ బలెన్.

"శ్రీలాలిత్యము నిత్యశుద్ధియు గుణోత్సేకంబునుం గల్గి యు
ద్వేలస్ఫూర్తి దలిర్చు తన్ద్రియను నబ్ధిం జంద్రుడై తోచినన్
బోలుంగాక భవాదృశుం డితరుడై పుణ్యంబులన్ బాసినన్
సాలగ్రామ ఖనిం జనించునె కదా? జాత్యల్పపాషాణముల్."

"తమ్ముడా ! పాలవంటి సంసారమున బుట్టితివి. తల్లిదండ్రుల నేడ్పించు చుంటివి. అగ్నిసాక్షిగ బెండ్లియాడిన యిల్లాలి సొగసు నీకక్కరలేక పోయెను. ధర్మము తప్పితివి. నీ చదువులు చిలుకచదువు లనుచు దోడివారలు నవ్వరా?" అని అక్కగారు మిక్కిలి వగచి కన్నీరు మున్నీరుగా దుఃఖించినది. ఊరుకొనలేక మరల తమ్మునకు బోధచేయ సమకట్టినది.

"వీరావేశము దాల్చి సర్వధనము న్వెచ్చింతు గాకేమి మూ ర్ఖారుం బండు నఖండసేతువృతముల్ కాశ్మీరఖండంపు గే దారంబుల్ తెగనమ్మగా జనునె నిర్ధారుండవే వెన్కనె వ్వారున్ లేరె సహోదరాదులు, కులధ్వంసంబు నీకర్హమే?"

ఈ బోధవలన నిగమశర్మకు గొంతబుద్ధి కలిగెను. అతడు మానినచదువులు మరల జదువ సాగెను. నెచ్చెలులెవరైన నెదురైనచో శర్మ తలవంచును. చేసికొన్నభార్యను బలుకరింప దలచెను. పెద్దవారల గౌరవింప మొదలిడెను. తండ్రి మడిబట్టలు తానె యుదుకసాగెను. అంగడికి బోయి వెచ్చము తానె దెచ్చును, ఈతీరున తేనెపూసిన కత్తివలె నిగమశర్మ కొంతకాలము గడిపినాడు.

ఒకరాత్రి నిగమశర్మ గృహములో నగల నూచముట్టుగ కాజేసి పారిపోయెను. ఆత డడవిలో దిరుగాడుచుండ దొంగలు బాణములు వేసిరి. శర్మ శరీరము రక్తసిక్త మయ్యెను.

అంతట కాపుకోడు కొక్కడు మనసు కరగగ వానిని స్వగృహమునకు దోడ్కొని పోయెను. నిగమశర్మ కాపు వానిని బరమాప్తునిగా దలంచెను. తలలోపల నాలుకవలె, పూసలలో దారమువలె మనసులు గలసి యభేదముగ వారిరువురు మెలగుచుండిరి. కాపువానికొక వికారపు గోడలుండెను. నిగమశర్మ దానితో జెలిమి చేసెను. గుడినుండి గుడిరాళ్లు దీయురీతి, కాపు వసతిని జేరిన శర్మ దుర్మార్గమున కొడిగట్టెను. తలపుండ్లు గడిగి తన్ను బ్రతికించిన విశ్వాసము శర్మ మరచినాడు.

గ్రామములో దిరునాళ్లు వచ్చెను. అమ్మహోత్సవము జూచు వేడ్కతో గ్రామకన్యలు బయలుదేరిరి. ఆబాల గోపాల ముత్సవదర్శనమునకై బయలువెడలిరి. కాపుకోడలు పాలవంటి కులమునకు దలవంపులు తెచ్చి నిగమశర్మతో వెడలి పోయెను. శర్మ కాపుదానిని వివాహమాడి మాంస భోజనమున కలవాటు పడెను. తరువాత వారికి సంతానము గలిగెను. కొంతకాలమునకు వారిల్లు తగులబడిపోవుట జేసి భార్యయు పిల్లలును మరణించిరి.

నిగమశర్మ దుఃఖసంతప్తుడై తన యాలిని జూడవలెనని నిరాహారవ్రతుడై తిరుగ జొచ్చెను. బహుయోజనములు తిరిగి తిరిగి శర్మ నృసింహక్షేత్రమును బ్రవేశించెను. పూర్వ పుణ్యసంస్కారలేశముచే నతనికి తీర్థరాజము కనబడెను. అందాతడు స్నానము జేసెను. భార్యావియోగ దుఃఖముచే

శర్మ హృదయము తప్తమయ్యెను. ఆహారము లేకుండుటచేసి యతని చెవులు గడియలు పడెను. ఆతడు పుడమిపై బడి ప్రాణములు గోల్పోయెను.

ఈతీరున మహాపాతకముల గొడిగట్టిన నిగమశర్మ తుదకు బాండురంగ క్షేత్రమున శరీరము గోల్పోయెను. యముని దూతలు శర్మ శవము దరికి విచ్చేసిరి. పుణ్యక్షేత్రమున నతడు మరణించుటచేసి పుణ్యలోకమునకు బోవలయును. అద్దాన హరిభృత్యులేతెంచి నిగమశర్మను గరుడయానమున విష్ణులోకమునకు గొంపోవ సమకట్టిరి. యమదూత లందుల కియ్యకొన రైరి. అందుచే విష్ణువు సుదర్శనమను చక్రమును బంపెను. చక్రాహతికి యమదూతలు ఖండింపబడిరి.

నిగమశర్మ పాపకార్యములొనర్చినను పుణ్యతీర్థమున గతించుటచే బుణ్యలోకమున కేగెనని రామకృష్ణకవి వైష్ణవ భక్తి ప్రతిపాదకముగ 'బాండురంగమాహాత్మ్యము' రచించి కీర్తి బడసినాడు.

---

## తిక్కన సోమయాజి

వేదవ్యాస రచితమైన సంస్కృత మహాభారతము నాంధ్రీకరించిన కవిత్రయములోని తిక్కన సోమయాజి కవి

బ్రహ్మగ ఖ్యాతి గాంచినాడు. కలమును బట్టనేర్చిన వారు సాధారణముగ ఖడ్గమును బట్టలేరు. కాని తిక్కన కలముతో బాటు ఖడ్గమునుగూడ చేబట్టి రాజ్యభారముమ వహించిన మేటి మంత్రి.

తిక్కన తాతగారు, భాస్కరమంత్రి, గుంటూరు మండలమునకు ప్రతినిధియై, ఆంధ్రదేశమునేలిన పృథ్వీశ్వర మహారాజునకు ప్రీతిపాత్రుడై 'భాస్కరరామాయణ'కర్తగా యశస్సు పొందెను. తిక్కన తండ్రి, కొమ్మన, ప్రసిద్ధ దండ నాయకుడు. ఇత నింటిపేరు కొట్టరువు వారు. తిక్కన పూర్వులు గుంటూరు మండలమున వెల్లటూరిలో నుండెడి వారట. ఉద్యోగ ధర్మముచే వారు గుంటూరికి విచ్చేసిరి. మనుమసిద్ధి యను భూపాలుడు విక్రమసింహపురి (నెల్లూరు) నేలుచు, తిక్కన కుటుంబము నాదరించి నెల్లూరికి వారి నాహ్వానించి తోడ్కొనిపోయెను.

కొంతకాలమునకు తిక్కన మనుమసిద్ధి భూపాలుని రాజ్యభారమునువహించి మహామంత్రియై, వేదవిద్యా పాల కుడై గీర్వాణాంధ్రములయందు కవిత్వము జెప్పి విఖ్యాతు డయ్యెను.

మనుమసిద్ధి రాజనీతిజ్ఞుడే కాక ఆంధ్ర భాషోద్ధారకు డయ్యెను. అతడు తిక్కనను 'మామా' యని బిలిచెడి వాడట. మనుమసిద్ధిరా జొకనాడు నిండుపేరోలగ ముండి వినయపూర్వకముగ తిక్కన నేదేని కావ్యము రచించి తనకు

గృతి నిమ్మనెను. భూపాలుని కోరిక దీర్పనెంచి 'నిర్వచనో త్తర రామాయణము'ను వ్రాసి రాజున కంకిత మొసగెను. కృతిభర్త యైనందున మనుమసిద్ధి మిగుల సంతసించెను.

ఇతర కవులయెడ తిక్కనకు మాత్సర్యము లేదు. విక్రమసింహపురి కేతెంచిన కవి పండితుల నతడు సమ్మానించెడివాడు.

"వీరనికాయంబు వేద నినాదంబు
బాయక యేప్రొద్దు మ్రోయుచుండు
భూసుర ప్రకరంబు సేసలు చల్లంగ
బాయ కెన్నియొ కుటుంబములు బ్రదుకు
బ్రాహ్మణావళికి ధారలు పోసిన జలంబు
సతతంబు ముంగిట జాలువాఱు
రిపులకొసగిన పత్రికల పుత్రికలను
బాయక కరణముల్ వ్రాయుచుంద్రు
మానఘనుడైన తిక్కన మంత్రియింట
మదనసముడైన తిక్కన మంత్రియింట
మహిత యశుడైన తిక్కన మంత్రియింట
మంత్రి మణియైన తిక్కన మంత్రియింట."

మూలఘటిక కేతన యను కవీంద్రుడు మనుమసిద్ధి దర్శనార్థము సింహపురి కేతెంచెను. తిక్కన ప్రేరేపణ వలన కేతన 'దశకుమారచరిత్ర' మను కావ్యముమ రచించి

భూపాలునకు గృతిగ నిచ్చెను. కేతన తిక్కన గుణగణముల నీరీతి స్తుతించెను.

"సుకవీంద్ర బృంద రక్షకు డెవ్వడనిన
వీడను నాలుకకు దొడవైన వాడు
చిత్త నిత్యస్థిత శివు డెవ్వ డనిన
వీడను శబ్దమున కర్థమైన వాడు
దశదిశా విశ్రాంత యశు డెవ్వడనిన
వీడని చెప్పుటకు బాత్రమైన వాడు
సకల విద్యాకళాచరణు డెవ్వడనిన
వీడని చూపుటకు గుఱియైనవాడు
మనుమసిద్ధి మహీశ సమస్తరాజ్య
భార ధౌరేయు డభిరూప భావభవుడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుడు
దీనజనతా నిధానంబు తిక్కశౌరి!"

నన్నయభట్టు మరణించినతరువాత భారతాంధ్రీకరణ మెవ్వరును బూర్తిచేయ కుండుటచే తిక్కన తత్కార్యమున కుద్యమించెను. తిక్కనార్యుని తండ్రియగు కొమ్మన కుమారుని స్వప్నమున సాక్షాత్కరించి హరిహరనాథున కంకితముగ భారతాంధ్రీకరణము జేయుమని బురికొల్పెను.

సంస్కృత భారతమును దెలిగించుటకు బూర్వము తిక్కన బ్రాహ్మణోత్తముల సన్నిధిని యజ్ఞ మాచరించి సోమయాజిగ దీక్షితుడయ్యెను. యాగానంతరము తిక్క

నామాత్యుడు తిక్కన సోమయాజిగా వ్యవహరింప బడెను. మహాకవి భారతాంధ్రీకరణ మారంభించెను. నన్నయ భట్టారకుడు విడిచిపెట్టిన యరణ్యపర్వమును బూర్తిచేయక తిక్కయజ్వ విరాటపర్వ మారంభించెను. కొలది కాలములో బదునేను పర్వము లాంధ్రీకరించి తిక్కన కృతకృత్యు డయ్యెను.

మనుమసిద్ధి రాజ్యమేలుకాలమున దేశమున యుద్ధములు చెలరేగెను. ఒకవైపు చాళుక్య నరపాలురు దేశము జయించి నిరంకుశులై చిన్నచిన్న రాజ్యములపై దండెత్తుచుండిరి. వేఱొకవంక కాకతీయులు ఓరుగల్లును రాజధానిగ జేసికొని చాళుక్యులవలెనే దేశమంతయు జయింపవలె నని చిన్నరాజులతో వైరము పెట్టుకొనుచుండిరి.

దేశ మీరీతిగ యుద్ధములతో నిండియుండ విక్రమ సింహపురి నెవ్వరును దండెత్తకుండ తిక్కన కాపాడెను. అతడు సమయమునకై వేచియుండి శత్రురాజ్యములపై బడి విజయసంపాదనకై యత్నించెను. కవి తిక్కనయు, అతని సోదరుడగు ఖడ్గతిక్కనయు మనుమసిద్ధికి రెండు భుజముల వలె నుండిరి.

కవిబ్రహ్మయగు తిక్కనసోమయాజి ఖడ్గతిక్కనవలె సేనాధిపత్యమువహించి రణకౌశలమును జూపెను. విజయ పరంపర సాధించినతరువాత తిక్కన భారతాంధ్రీకరణమును

బూ_ర్తిచేయ కలిగెను. వలసినపుడు ఖడ్గమును, శాంతికాలమున లేఖనిని జేబూనిన తిక్కన వీరకవీంద్రుడగుచున్నాడు.

భారతాంధ్రీకరణానంతరము తిక్కనకు బరమార్థ చింతనకు సమయము లభింపలేదు. మనుమసిద్ధి భూపాలుని రాజ్యములో విప్లవము చెలరేగెను. ఆకస్మికముగ అక్కన బయ్యన లనువారు సేనానీకముతో విక్రమసింహపురిని ముట్టడించిరి. మనుమసిద్ధి బంధితుడయ్యెను. శత్రువు లాతనిని కారాగారమునందుంచి రాజ్యభ్రష్టుని గావించిరి. అక్కన బయ్యనలే రాజ్యభారము వహించిరి. తిక్కనకు గర్తవ్యము స్ఫురింపలేదు. అహోరాత్రములు కవీంద్రుడు ప్రభువును విడిపించు నుపాయ మాలోచించెను. దండోపాయ ముపయోగకరముగా లేకుండుటచే అద్భుత రాజ్యతంత్రముచే కార్యము సాధింప నెంచెను. రహస్యముగ తిక్కనామాత్యుడు రాత్రివేళ ఓరుగల్లునకు వెంట భారతమును తీసికొని ప్రయాణమయ్యెను.

తిక్కనామాత్యు డోరుగల్లు చేరి గణపతి దేవుడు కొలువున్న సమయమున బ్రతీహారులచే దన రాకనుగూర్చి కబురంపెను. కాకతిప్రభువు తిక్కన సోమయాజి కెదురేగి తెచ్చి యర్హాసన స్థితునిగ జేసెను.

కొంతసేపటికి తిక్కనసోమయాజి తానాంధ్రీకరించిన భారతమును గణపతిదేవ భూపతికి వినిపింప దొడగెను.

ద్రౌపది శ్రీకృష్ణునితో దాను మున్నుపడిన భంగపాట్లు చెప్పిన పద్యములు తిక్కనకవీంద్రుడు పఠింపదొడగెను.

"వరమున బుట్టితిన్ భరతవంశము జొచ్చితి నందు పాండు భూ
వరునకు గోడలైతి జనవంద్యుల బొందితి నీతి విక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ! యిన్నిట ప్రశస్తికి నెక్కినదాన నెంతయున్.

"నీవు సుభద్రకంటె గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టినను బంకజనాభ! యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణివట్టి యీ
యేవురు జూడగా సభకు నీడ్చె; గులాంగన నిట్లొనర్తురే?

"ఆసభ నేకవస్త్రయగునట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసను జూచుచుం బతు లసంభ్రములై తగుచేష్టలేక నా
యాసలుమాని చిత్రముల యాకృతినున్నయెడన్ ముకుంద! వి
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చె మనంబదియుం దలంపవే.

"ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి వెండ్రుకల్
దావల చేతబూని యసితచ్ఛవి బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలగ మనంబున బొందు విషాద రోషముల్
గావగ లేక బాష్పములు గ్రమ్మగ దిగ్గనలేచి యార్తయై.

"గోవిందు ముందటం బెట్టి యిట్లనియె :

'ఇవి దుస్ససేను వేళ్ళం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కా

రవులకడ దీఱు మాటల
యవసరమున దలపవలయు నచ్యుత! వీనిన్

"నెట్టన యట్టి యల్క మదినిల్పితి రక్కసతాల్మి జిచ్చొడిం
గట్టిన యట్లు పెద్దయును గాలము దీనికి నాఱు లెన్నడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తో
బుట్టువు నీవు; దేజమున బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!

"అనుచు నెలుంగు రాలువడ ద్రౌపది యేడ్వగా కృష్ణుని మనసు కరిగిపోయెను. ఆమె నోదార్చి, కన్నీరు దుడువను, వేణి ముడునను కృష్ణుండు తగువారిని నియోగించెను.'

కావ్యమాలించిన గణపతి దేవుని హృదయము కరుణతో నిండిపోయెను. వెంటనే ఆతడు కవిబ్రహ్మకు రత్నాభరణములు చీనాంబరములను సమర్పించెను. తిక్కన సమయము గనిపెట్టి "ప్రభూ! మీ సామంతుడైన మనుమసిద్ధి కారాగారమున బంధితుడై యున్నాడు. రాజ్యము శత్రుహస్తగతమైనది. మీసాహాయ్య మర్థించుచున్నాను" అని కాకతి ప్రభుని గోరెను. ప్రభువు మనుమసిద్ధికి సాహాయ్య మొనరింతునని వాగ్దానముచేసి సేనానాయకుని బిలిచి దండయాత్రకు సేనానీకము నాయత్తము చేయుమని ముదల యొసగెను. తిక్కన పొందిన యానందమునకు మేర లేదు. విక్రమసింహపుర రాజ్యము నిల్పుటకును, మనుమసిద్ధిని సింహాసనముపై బ్రతిష్ఠించుటకును భారతకవిత్వ ముపయుక్తమైనదని మిక్కిలి సంతసించినాడు.

కవితిక్కన సేనాసహాయముతో గణపతి దేవునితో 1295 సంవత్సరమున విక్రమసింహపురి దుర్గమును ముట్టడించెను. అక్కన, బయ్యన లోడిపోయిరి. మనుమసిద్ధికి సింహాసనము ప్రాప్తించెను. తిక్కనసోమయాజి గంటమునే కాక ఖడ్గమును గూడ బట్టనేర్చిన వీరుడనియు, రాజ్యతంత్రజ్ఞుడనియు పేరొందెను. మహాభారతమున బదునేను పర్వములు తెలిగించి తిక్కయజ్వ కవిబ్రహ్మయై ఆంధ్ర వాఙ్మయమున శాశ్వతస్థానము పొందినాడు.

---



*Triveni Non-detailed Series—Junior Grade*
*Editor:* SRI CHINTA DIKSHITULU

# KAVI PUJA

*By*
T. KRITHIVASA THIRTHULU, B.A., B.ED.

TRIVENI PUBLISHERS, MASULIPATAM

